# కృతజ్ఞత

ఉపనిషన్మధువు ముస్లిముసోదరుల కందిచ్చి ధన్యుడైన దారావంటి మహనీయుని జీవితము నాంధ్రసోదరుల కందించుట నా కర్తవ్యమని భావించితిని. హిందూ మహమ్మదీయ సమైక్యతకొరకు గాంధీమహాత్ముడు తనువుల బలియిచ్చినట్లే దారా రాకుమారుడును తన నిండుప్రాణములు హిందూమహమ్మదీయ ఏకత్వముకొరకే బలియిచ్చినాడు. ఇట్టి ఆదర్శ పురుషుని చరిత్రము విద్యార్థులకును, విద్యాధికులకును ఆదర్శప్రాయమైన దనుటలో సందేహములేదు.

ఈ చరిత్ర వ్రాయుటలో నాకు ప్రేరణకలిగించిన కాళికారంజన కానుంగో, ఎం. ఏ., పి. హెచ్. డి., గారికిని, డాక్టర్ ఆర్. సి. మజుందారు, ఎం. ఏ., పి. ఆర్. ఎస్., పి. హెచ్ డి., గారికిని, జదునాథ సర్కారు, కె. టి., సి. ఐ. ఈ., గారికిని నన్ననేకవిధముల ప్రోత్సహించిన శ్రీ కె. సత్యనారాయణమూర్తి, బి. ఏ., బి. ఇడి., గారికిని, వ్రాతప్రతి సరిచూచిన విద్వాన్ జి. రామకృష్ణ శెట్టిగారికిని కృతజ్ఞుడను.

నగరి — పి. కృష్ణమూర్తినాయుడు

# మొదటి ప్రకరణము.

## ⟶ షాజహాను ⟵

మొగలు సామ్రాజ్య స్థాపనానంతరము దానివలన భరతఖండమునకు కలిగిన నష్టము లటుంచి కలిగిన లాభములను గూర్చి మనమంతగ యోచించుటచేటు. 1556 వ సంవత్సరము నాటికి మొగలులు భారతదేశమున నెక్కువ ప్రదేశము నొకే పాలనలోనికి తీసుకొనివచ్చుటయు, నొకేవిధమగు నాగరికతను పెంపొందజేయుటయు, విదేశీయులకు మనదేశ విజ్ఞానము దెలిపింపజేయుటయు జరిగిపోయెను దేశములోని వివిధవర్గముల యేకాంత భావముల నడలి సమైక్యభావమున ప్రబల రాజశక్తియగు మొగలు చక్రవర్తుల యధీనత జెందెను, ఇట్టి యేకైక పరిపాలనా సుఖము అక్బరు, జహంగీరు, షాజహాను చక్రవర్తుల కాలమున ప్రవర్ధమానమయ్యెను. కాని గడించిన సామ్రాజ్యలక్ష్మి తలవనితలంపుగ చక్రవర్తియగు నౌరంగజేబు కాలమున గడగడలాడిపోయెను, ఐకమత్యత సన్నగిల్లెను, హిందూమహమ్మదీయ సోదరభావము స్థూలమగుటకు బదులు సూక్ష్మాతిసూక్ష్మమైపోయెను. ఏకీభావముల పెంపొందజేసికొని కనుసన్నల ప్రవర్తించిన మండలములందు విభిన్నతాభావములు పెంపొంద వేరుకాపురమున కెదురుజూచుటకు ప్రారంభించెను. అటు కీర్తించివ్రాసిన చరిత్రకారుల లేఖిని యిటు కన్నీటిబొట్టుల నద్ది దేశపీడనము గూర్చి వ్రాయవలసివచ్చె. మొగలాయుల రాజ్యవిచ్ఛిన్నత తప్పనిసరి యయ్యెను. ఔరంగజేబు సింహాసనా

సీనుడగుటకు బదులు అతని సహోదరుడు రారాజు దారా చక్రవర్తియైయుండినచో అనాటికే భారతదేశ విసూతనా జాతీయతాతత్వము స్వప్నగతా వృత్తాంతమైయుండదు. ప్రపంచము నకు ప్రకృతి అప్పుడప్పుడు జేయువినాశమునకన్న మానవుడే యెక్కువ ప్రబల శత్రువై దేశదారిద్ర్యమునకు, దుఃఖమునకు, దరిలేని యిడుములకు కారకుడగుచున్నాడు. మానవుడు తనలోని దైవత్వము రూపుమాపి దురాశాపరవశుడై, న్యాయాన్యాయ, ధర్మాధర్మ విచారశూన్యుడై, క్రూరకిరాతుడై, దుర్మార్గదేవతకు దాసుడై, చేయరాని పనులజేసి విధి నన్నిట్లుజేయించనని దాగుడు మూతలాడినంతమాత్రముననేమాయె. తానుజేసిన దౌష్ట్యఫలితముగ ఇనుమును జేరిన అగ్నికి సమ్మెటపెట్లు తప్పవన్నట్లు తాను పరిపాలించు ప్రజలుసహితము తనతోగూడ కష్టము లనుభవింపక తప్పునా !

సమర్కాండునుండి నిరాధారుడై, నిలువనీడలేక తరుమబడిన మొగలాయి బాలుడైన బాబరు భగవత్కృపవలన దిన దిన ప్రవర్ధమానుడై అఫ్ఘనుదేశమునకు రాజై, ఢిల్లీలోని యిబ్రిహింలోడీ చక్రవర్తి యనుచరులు భారతదేశముపై దండెత్తి నాహ్వానింప నట్టి తరుణమును రిత్తబోనీయక సమయోచిత విజ్ఞానిక సంభావితుడై మన దేశముపై దండెత్తి మొగలాయి సామ్రాజ్యమును స్థాపించెను. దిక్కులేని బాలుడు బాబ రేనాటికైన భారతసామ్రాజ్య చక్రవర్తి యగునని యెవరు స్వప్నము

గాంచిరి! ఇదియే భగవంతుని లీలావినోదమని పెద్దలందురు. మనదేశపు చరిత్ర ఆనాటికి వేరువిధానముగ నుపక్రమింప భగవంతుని సంకల్ప మగుటచేగాబోలు బాబరు మొదటి మొగలాయి చక్రవర్తియయ్యెను. 'దైవీబలే దుర్బలే' యన్నట్లు శౌర్యవంతులగు రసపుత్రరాజు లెంతటి నిరోధము కల్పించినను, నా మొగలాయి భానోదయమును నడ్డుకొనలేకపోయిరి. బాబరు తరువాత నతని కుమారుడు హుమాయూనును నతని తర్వాత నతని పుత్రుడు అక్బరు సార్వభౌముడు 1560 సంవత్సరమున మొగలు సామ్రాజ్యలక్ష్మిని విస్తరింపజేసి హిందూ మహమ్మదీయ సమ్మేళనా సోపానములపై రాజ్యసౌధము నిర్మించి రాబోవు మొగలు పాదుషాలకు స్థిరరాజ్య సంపదల నేర్పరచెను. అక్బ రనంతర మతని తనయుఁడగు జహంగీరుపాదుషా తన పత్ని నూర్జహాను మహారాజ్ఞీగారిని సితపరిజ్ఞాన సహాయుడై ప్రజానురంజకముగ పరిపాలించెను. జహంగీరు కుమారుడగు షాజహాను చక్రవర్తి యయ్యెను. ఇతడే మన కథానాయకుడగు దారాజనకుడు. మొగలు సామ్రాజ్యలక్ష్మి షాజహానుని కాలమున ప్రఫుల్లవదనయై నాట్యమాడఁజొచ్చెను. ప్రపంచమున గల సప్తసమాశ్చర్య కట్టడములలో నొక్కటియై స్ఫటిక శిలానిర్మితమై భారతసామ్రాజ్యపు జడలోని పువ్వువలె ప్రకాశితమై స్వర్గముతోనిక బనిలేనియట్లు గట్టింపబడిన తాజమహలను దివ్యభవనము చక్రవర్తి భార్యయగు ముంతాజ్‌మహల్ యొక్క భౌతికదేహవిశ్రాంతికై

యమునానదీ తీరముపై నేటికిని రసులపందుపై వెలయుచున్నది. ఈ సౌధముయొక్క సౌందర్య ఔన్నత్యములటువంటి శిల్పకళా పిపాసియగు యమునాతరంగిణి తాను పోవుచున్న దారిని వదలి సమీపించి విస్మితయై ఆసౌధపాదముల ముద్దిడి మరల. తన మధుర స్వప్నమునుండి విడువడి గంగలో గలియు తనకర్తవ్యము స్మరణకురా ఆనదీతోయము త న ప య న ము సాగించు చున్నట్లు నేత్రములకు గోచరించుచున్నది. ఇదిగాక మానవనేత్ర విభ్రమ సంచలితమై యొప్పారు మణిమయఖచితమయూర సింహాసనము సహితము ఆభూపాలుడు నిర్మింపజేసెను. అంతే గాదు, మోతీమసీదు, జుమ్మామసీదు మొదలగు కట్టడము లనేక ములు ఆధరణీనాధుని మనోసంకల్పమహిమచే మాంత్రికుని మంత్రదండబలమోయన భూగర్భమునుండి వున్నటులుండి పైకి లేచినవా! అన్నచందమున శాశ్వతములై నిలచిపోయెను.

షాజహానుపాదుషా మొదట యెంతటి మహోన్నత దశనంది విలాసాలంకార ప్రియుడై సుఖవార్ధిదేలెనో, తుదిదినము లలో నంతటి దుఃఖాబ్ధిలో మునిగి కృశించిపోయెను. ఇతని అపారభిన్నతకు తన తనయులలో మూడవవాడగు ఔరంగజేబు కారణుడయ్యెను. పాదుషాగారి ఆనందతరంగ డోళికల తెగ నరకుటకు ఈతృతీయనందనుడు ప్రజ్వలనావిషానలమై అతని సుఖజీవితమునకు వేరుపురుగయ్యెను. దారాయొక్క చరిత్రను ప్రారంభించుటకు ముందు షాజహానుపాదుషావారి సంతాన

జన్మక్రమమెఱుగుట మిగుల సమంజసమగుటచే నయ్యది ఇందు పొందుపఱుపబడెను.

షాజహాను—ముంతాజ్ మహల్

## వీరి సంతానము

—:0:—

1. హూర్ ఉన్ ఉన్నిసా : 1613వ సం॥ మార్చి 20 వ తేది శనివారము జననమంది 1616వ సం॥ మే నెల 1వ తేదీని మరణమందెను.

2. జహానారాబేగము : మీవారు దండయాత్రి సమయమున హీని అనుగ్రామ సమీపమున 1614వ సం॥ మార్చినెల 23వ తేదీని జననమందెను. తండ్రి దుఃఖములందు పాల్గొనినతనయ. బ్రహ్మచర్యవ్రతావలంబిని.

3. దారాషూకో మన కథానాయకుడు. ఆజ్మీరునగరునందు తమ్ముడగు ఔరంగజేబుచే మృతుడయ్యెను. 1615 వ సం॥ మార్చినెల 20వ తేది సోమవారమున జన్మించెను.

4. షాషూజా : అజ్మీరునగరమున 1616 వ సం॥ జూన్‌నెల 23వ తేది ఆదివారము రాత్రి జననమందెను. ఔరంగజేబుచే అరకానుకు దరుమబడి నశించెను.

5. రౌషన్‌రాయి లేక రౌషనారాబేగము : బరహాంపురమున 1617 వ సం॥ ఆగస్టు 24 వ తేది ఆదివార ముదయించెను. షాజహాను దుఃఖానలమునకు గృత సమర్పిణి యగు కాలసర్పిణి.

6. ఔరంగజేబు : 1618వ సం॥ అక్టోబరు 24 వ తేది భానువారము రాత్రి బొంబాయి రాష్ట్రములోని దోహద్ అను గ్రామమునం దుద్భవించెను. ఈ వంశాంకురమే జనకుని దుఃఖమునకు, సోదరుల మరణమునకు, రాజ్యపతనమునకు కారణమయ్యెను.

7. ఉమ్మదుబక్షు : 1619వ సంవత్సరము డిసెంబరు 8వ తేది బుధవారము సర్‌హిందీ యను గ్రామమువద్ద జననమంది 1622 వ సం॥ ఫిబ్రివరి మాసమున బరహాంపూరు అను గ్రామమున మరణించెను.

8. సూర్యబానుబేగము : 1621వ సం॥ మే నెల 31 వ తేదీని జననమంది 7 వత్సరములవయస్సున 1628వ సం॥ ఏప్రిల్ 18వ తేదీన మరణించెను.

9. ఒక కుమారుడు : 1622 సంవత్సరమున బుట్టి నామకరణముగాకమున్నే మరణించెను.

10. మురాదుబర్షు : 1624 సం॥ సెప్టెంబరు 28వ తేది బీహారులో నిరోతారు అను కోట యందు జన్మించెను. (ఔరంగజేబుచే విషప్రయోగితుడై మరణించెను)

11. లుతుఫుల్లా : 1626వ సం॥ అక్టోబరు 25వ తేదీని జననమంది 19 వ మాసాంతమున మరణించెను.

12. దౌలత్అఫ్జా : 1625 వ సం॥ ఏప్రిల్ 28 వ తేదీని జననమంది 1629వ సం॥ మే 3 వ తేదీని మరణించెను.

13. ఒక కుమార్తె : 1630వ సం॥ ఏప్రిల్ 13 వ తేదీన పుట్టి వెంటనే మరణించెను.

14. గౌహరారాబేగము : 1631వ సం॥ జూన్‌నెల 7 వ తేది బుధవారము రాత్రి బరహాంపురమున జననమందెను. తల్లి ముంతాజ్ మహల్ ఈమెను ప్రసవించి మరణించెను.

పాదుషా షాజహాను జ్యేష్టనందనుడును యువరాజును నగు దారా మొగల్‌రాజకుటుంబమున మానికమువంటివాడు. అతని విషాద మరణముకంటె జీవితములో నీవిషాదమే మనము గమనింపవలసిన ముఖ్యవిషయము. అక్బరనంతరము వచ్చిన మొగల్ పాదుషాలు వీరత్వము, అవినీతి, సుఖాభిలాష లభిలషించిన వర్గమున జేరినవారు. వారి జీవితగమ్యస్థానము సమరము, సురాపానము, స్త్రీలోలత్వము, సింహాసనము అనునవియే. వారు విజ్ఞానసంపాదనకై మచ్చునకైన బ్రియత్నింపక కుటిలకు యుక్తిపన్నాగములలో తమ జీవితమంతయు వ్యర్థపుచ్చిరి. 'మాంసం మాంసేనవర్ధతి' అను నార్యోక్తి వారికి ప్రధానమయ్యెను. పారమార్థిక చింతనము వారిలో స్వప్నగతమై పోయెను. దారా యొక విజ్ఞానపిపాసియగు వేదాంతవేత్త. పౌరపాటున ముంతాజ్ గర్భసూక్తి యుక్తాఫలమైన హక్కు దప్ప, నెమిలి సింహాసనాసీనుడగుటకు యెట్టి ప్రత్యేకమగు గుణములతనియం దేవియు లేవు. దారా రాజగర్భసంభవుడుగాక ఒక బీద కుటుంబమున జన్మించియుండినచో అతడొకమహాత్ముడై,

ప్రపంచ ప్రేమ పరిణామమునకు సూత్రధారుడై, పవిత్ర హృదయుడై, ఉదారచరితుడై, విజ్ఞానమూర్తియై, అమేయజీవియై జీవితమంతయు క్రూరపువిధిచే వెక్కిరింపబడి పలుబాములు బడక పేరు ప్రతిష్ఠలతో ప్రశాంత జీవియగు బుద్ధుని జీవిత ననూగతుడై వర్ధిల్లి యుండెడివాడు. ఈ రారాజు పరలోక చింతకును మొగలుల రాజమందిరా సుఖ సాంప్రదాయములకును మధ్య నలిగి పోయెను. శాశ్వత మానవ సుఖములకై త్యాగి గావలసిన ప్రాణి మకుటాధిపత్యమునకై మంతనము లాడవలసి వచ్చెను. సర్వేశ్వరుడు స్వర్గదామమునకు వేయుటకిచ్చిన నిచ్చెనను యితడు సింహాసనము నందుకొనుటకు బ్రయత్నించెను. దేశ చరిత్రలందు యిట్టి విధివిధాన పరివృతుడై దుఃఖము ననుభవించిన వ్యక్తిని మనమెచ్చటను గని విని యెరుగము.

ఆత్మసంబంధమగు విజ్ఞానము గడించుటకు గడిపిన కాలమును, దారా యుద్ధశాస్త్రమును నేర్చుకొనుటయందు గడపి యుండినచో; ఉపనిషత్తులు తర్జుమా జేయుటకు జేసిన కాలహరణము, ప్రాపించక మోసముల దెలసికొనుటకు వినియోగించి యుండినచో; జ్ఞానహీనుడై అహింసాతత్త్వవిచారణ సాగింప బ్రయత్నింపకుండినచో అతడొక వేళ సార్వభౌముడై విరాజిల్లియుండు నేమో, యెవ రెరుగుదురు? హిందూమహమ్మదీయ సమైక్యోన్నతియే దారాయొక్క ముఖ్యలక్ష్యము. భారతదేశ మతైక్య శాంతి స్థాపనకై యెవరైన నిజముగ బ్రయత్నింపదలచినచో దారామహాశయుడు చేసివిడచిన కృషిభాగమునుండియే ఆరంభించియుండినచో

దేశమున మతైక సమైక్యత తప్పక లభించియేయుండును. దురదృష్టవశాత్తు ఈ ప్రయత్నమునకు యే మొగలు రాజవంశ స్థుడును ప్రయత్నించియుండలేదు. మత విషయమై దారా పడిన పాటు దారాతోనే యంతరించెను.

ప్రపితామహుడగు అక్బరు స్థాపించిన మత సమ్మేళనా సామ్రాజ్యమే దారాయొక్క మధుర స్వప్నమయ్యెను. పదునైదు, పదునారవ శతాబ్దములందు కబీరు, అక్బరు మొదలగు మహా పురుషులు ప్రయత్నించి చేసిన మతప్రిషైక ప్రణాళికాప్రకాండమునే పదునేడవ శతాబ్దమున యువరాజగు దారా మరల ప్రారం భించెను. దారా ఔరంగజేబు లిద్దరు షాజహాను గుణద్వయ ప్రతిబింబములు. ఒకటి దేశప్రశాంతమునకై భారతదేశమున కను వగు హిందూమతసమ్మేళనా వృతంబయిన మహమ్మదీయ మతము ప్రవేశబెట్టదలచిన నిష్కల్మష వేదాంతమూర్తి; మరి యొకటి క్రూరకుటిలాత్మకమానసమై యపార రాజ్యకాంక్షా సమ న్వితంబైన అచ్ఛమగు ముస్లిము మతావేశాపరవశంబైన విధ్వంసక నిర్లక్ష్య నరాంతక నర్తకవ్యక్తి. దారా కురాను ఉప నిషత్తులకు మధ్యలోపావిర్మితమగు వంతెన నిర్మించి మతద్వయ ఐక్యతకుపాటుపడుటే గాక ఈరెండుమతముల ఔన్నత్యమునకు సహితము ప్రయత్నపడెను. అతడు యితర మతగ్రంధముల లోని రహస్యాతిరహస్య ఉద్బోధనల సహితము పామర భోజ్య ములగునట్లు తన జీవితమును వినియోగించెను.

సర్వేశ్వరుని సృష్టి రహస్యముల యంతరములు, ఆరహస్యములోని యర్థములే మానవులు గ్రహింపగలుగుచో మిగుల ధన్యులే యగుదురు. కాని వానిని తెలిసికొనుట మిగుల క్లిష్టము. నీతివంతుడై మానవ ఉత్తేజమునకు శాశ్వతమార్గము గల్పింప తన జీవితమును ధారవోసి మత పరశీలనాదీక్షకై దైవచింతతో కాలముగడిపిన రాజర్షియగు దారా సుజీవితము భయంకరమై, విషజ్వాలల కాహుతియగుటకును, మతద్వేషామానసమూర్తియై, రాజ్యకాంక్షాదేవతకు నరరక్త స్నానమాచరింప వెనుదీయని ఔరంగజేబు సామ్రాజ్య మకుటాధి పతియగుటకును గల సృష్టి రహస్యమేమో తెలియదయ్యె !



# రెండవ ప్రకరణము

## దారా శైశవము

1615వ సంవత్సరము మార్చినెల ఇరువదవ తేదీ సోమవారము ఆజ్మీరునగరు మందిరము ప్రాంగణాలు విశుద్ధ రమ్య పుష్పాలంకృతమై సంశోభితమై ఆనందప్రదములై సలరారఅపారము ప్రజలు నూతన వస్త్రాలంకృతులై మందహాసవదనారవిందులై జై జై ధ్వానములతో వీథులందు దిరుగాడ నేత్రపర్వమొనరించుచుండె. ఇందులకు కారణములేకపోలేదు. ఆనాడు షాజహానునకు జ్యేష్ఠనందనుడు జన్మించిన దినమగుటచే సార్వభౌమునగరు మొదలు సందుగొందులవరకు ఒకటే విధమగు ఆనంద కోలాహలములు నిండిపోయెను. నగరు నందలి ప్రశాంతభావము పాదుషావారి సేవక బృందాది పరిజనుల నృత్యగీత వాద్యాది శబ్దములచే విచ్ఛిన్నమై పోయెను. ఈ సంబరములకు దారా జననమొక్కటే కారణభూతము కాదు. కొలదిదినములకు పూర్వము దారాజనకుడగు షాజహానురాకుమారుడు మీవారు చండయాత్రయందు విజయుడై మీవారు రాజగు ప్రతాపసింహుని మనుమడుతనవెంటరా ఆజ్మీరు ప్రవేశించుటే మొగలు విజేతలకు ముఖ్యకారణము. అప్పటికి జహాంగీరు మనియుండుటచే షాజహాను కుర్రం అనుపేర పిలువబడుచు సింహాసనాసీనుడు గాలేదు. జహాంగీరుచక్రవర్తి మనుమని జననవార్త విని మిగుల మక్కువమీర ఆ చిన్నపాపకు మహమ్మదు దారా షూకో అని నామమిడి, సామ్రాజ్యపు గులాబీ అని పిలుచుచుండెను. ఇట్లు

కుట్రంనకు గలిగిన పదునలుగురు సంపాప్తి సంతానమున నిరువురు పుత్రికలు, నలువురు పుత్రులు మాత్రము అతని అంత్యకాలమున నతని సింహాసనా సంపాదనకై జరిగిన భయంకర విషాదనాటకమున ముఖ్య పాత్రలైరి. దారాకు రెండువత్సరములు గడచునప్పటికి షాజహాను దక్కనుదేశమునకు సుబేదారుగ బంపబడెను. అచ్చట సహితము యువరాజ భుజస్కంధములపై విజయపరంపరలువర్షింపసాగెను. అతనికీర్తికాంత దేశమంతయు వ్యాపించుట విని మహారాణి నూర్జహాను ఓర్వలేకపోయెను. తన సవతిబిడ్డ అడ్డులేని తన నిరంకుశత్వమునకు విరోధముగలిగించునేమోనని యామె భయపడి షాజహాను సింహాసనాసీనుడు గారుండుటకు కీలుబొమ్మయగు తన భర్తతో మంతనములాడ దొచ్చెను. ఈ విషయము షాజహాను దెలసికొని ఆమెపై విప్లవము సాగింప మొదలిడెను. రెండువత్సరములు షాజహాను తన కుటుంబముతో తెలింగానా, బంగాళము, బీహారము మొదలగు దేశములందు తలదాచుకొనుచు నానాబాధలుపడుచు నూర్జహానుచే బంపబడిన సైన్యములు తమ్ము వెంటాడ విధిలేక చక్రవర్తితో సంధి ప్రయత్నములకు దిగెను. ఆ సంధి ఫలితముగ షాజహానుయొక్క సత్ప్రవర్తనమునకు పూచీగ తన కుమారులగు దారా, షూజా, ఔరంగజేబులు జహంగీరువద్దవిడువబడిరి. కాని నూర్జహాను అంతటితో సంతృప్తిచెందక కుట్రం రాజకుమారుడు రాజ్యపదవికి రాకుండుటకు రహస్యకుట్రలు బన్నజొచ్చెను.

అట్టి సమయమున జహంగీరుపాదుషా ఉబ్బసపువ్యాధిచే 1627వ సంవత్సరము అక్టోబరు 29వ తేదీన దివంగతుఁడయ్యెను.

తండ్రి మరణానంతరము షాజహాను రాకుమారుఁడు 1628వ సం॥ ఫిబ్రివరి 4వ తేదీని ఆగ్రియందు పట్టాభిషిక్తుఁడయ్యెను. అతఁడు చక్రివర్తియని ప్రికటించుకొనిన మూఁడు వారములకు ముంతాజ్‌మహల్ జనకుఁడగు అసత్‌ఖాన్ దారా, షూజా, ఔరంగజేబు లను ఆగ్రికు దీసికొనివచ్చెను. మునుముందు మాతయగు ముంతాజ్‌బేగము తనయుల పరామర్శించిన తదుపరి వారు పాదుషా దర్బారునకు దీసుకొనిరాబడిరి. దారా జనకునకు వందనము లర్పించి ఆనాటి ఆచారప్రకారము తండ్రికి కనకాభిషేకము గావించెను. అంత పాదుషా అమందానందకందళితహృదయుఁడై యువరాజగు దారా దినమునకు వేయిరూప్యములు తన పట్టాభిషేకసందర్భమున రెండులక్షల రూపాయల బహూకృతిగ నిచ్చున ట్లుత్తరువు గావించెను. దారాకు విద్యాభ్యాసమునకు సరియగు గురువర్యుని యేర్పాటుజేయుట చక్రవర్తికి విధియయ్యెను. ముల్లా అబ్దుల్‌లతీప్ సుల్తానుపురి అనునతఁడు దారాకు విద్యాగురువుగనియమింపబడెను. మొట్టమొదటి విద్యావిధానము అందరి మొగల్‌రాజకుమారులకువలె దారాకు సహితము నేర్పింపబడెను. కురాను, పర్షియనుల పద్యకావ్యములు, తైమూరుచరిత్ర. అబుల్‌ఫజల్ రాజనీతి యతనికి నేర్పింపబడెను. గురువరేణ్యుఁడగు అబ్దులతీప్ జెప్పదలచిన విద్యలు పండిత సాంప్రదాయములు.

జనకునివలె ముద్దులొల్కు చక్రవర్తి యువరాజు నేర్చుకొనెను.

ఫిర్దౌసీ, సాదీ పండితద్వయ కవిత్వములకంటె రూమో, జామో యను విజ్ఞాన వేదాంత వేత్తల సూత్రములు యీ భావి సామ్రాట్టును ఆకర్షింప గలిగెను. తండ్రికివలె రాజకీయతంత్రములు, దేశచరిత్రలు, అలగ్జాండరు, చంద్రగుప్తాదివీరుల చరిత్రి విననిచ్ఛగింపని యువరాజు అరిస్టోటల్, ప్లేటో మహాశయుల పాండిత్యప్రకర్షకు హర్షించుచుండెను. మొత్తమునకు సంగ్రామ సమీక్షలకన్న సన్యాసుల అద్భుత చరిత్రలే యాతనికి యానందమొనగూర్చుచుండెను. దారా కురానులోని సారమంతయు చక్కగ గ్రహించెను. జీవితమంతయు గ్రంధపఠనమునందెక్కువ కాలము గడుపజొచ్చెను. పక్షపాతులగు ముల్లాలు రచించిన కురాను విమర్శనలను చల్లగ దిగవిడచి పరమతసహనచింతతో రచింపబడిన గొప్పగొప్ప కవీశ్వరుల కవిత్వమునే యతడు దీక్షతో దిలకింపదొడగెను.

షాజహాను చక్రవర్తి యువరాజునకు రాజనీతియు, ప్రభుత్వధర్మములను ప్రబోధింప దర్బారునందు తన కన్నులయెదుటనే అతనిని నుంచుకొనుచుండెను. మానవ హృదయములందు ప్రజ్వరిల్లుచు పైకిమాత్రము వెడనవ్వులచే గప్పబడియుండెడు నర్మగర్భితంబగు నీచతత్వములు గ్రహింపలేక దారా ప్రతి మను

జుని తనవంటి సాధుస్వరూపునిగ భావించుచుండెను. ఈగుణముచే అతనికి ముందు ముప్పుదెచ్చెను. అక్బరు స్థాపించిన సామ్రాజ్యమును బలపరచుకొనవలయుననిన, అక్బరు సార్వభౌముని సూత్రముచే కర్తవ్యమని దారా తలచెను. అక్బరు వెలిగించిన సర్వమత సమైక్యజ్యోతి నార్పకుండ పెంపొందజేయవలసిన భారము యువరాజ చేత భుజస్కంధములపై బడెను. ప్రేమ ప్రశాంతములకు అన్యమతశరణ్య ప్రధానముగ జేకొనక ఖురాను లోని ప్రేమస్వరూపమును సహిత మతడు కనుగొనజాలెను. అతడు తన విశ్రాంతికాలము వృధాపోనీయక, యూదుల మత గ్రంథము, బైబుల్, హిందువుల వేదాంతసూత్రముల జదువుచుండెను. సంస్కృత పండితులరావించి భగవద్గీతను, ఉపనిషత్తులను హిందీలో అనువాదము జేయించెను. హిందువులతనిని అక్బరు సార్వభౌముని అపరావతారమని భావించి గౌరవించిరి. వేదాంత ప్రియులగు ప్రతిమానవులకు దారామంత్రము తారకమైపోయెను.

1629 వ సం॥ విఖ్యాత సేనానాయకుడగు ఖానుజహాన్ లోడీ షాజహానుపై దిరుగబడి తన 7000 సైన్యముతో దక్షిణదేశమునకు బరుగిడి బీజపూరు సుల్తానుతో జేరబోయెను. అతనిని దండింప సంసిద్ధుడైన చక్రవర్తి తన కుటుంబ పరివార సహితుడై దారాతో డక్కనునకు బయనమయ్యెను. ఆ దండయాత్రయందు దారా యేలాటి జోక్యము జేసికొనక ప్రశాంత చిత్తముతో మాతృదేవి ననుసరించుచుండెను. అట్టి సమయమున

కట్టెను. ఆ ముత్యాలశ్రేణి తన తండ్రియగు జహాంగీరు తన వివాహ సమయమున బహూకరించి యుండెను. 1633 సం॥రం ఫిబ్రవరి నెల 1 వ తేది శుక్రవారమునాడు రాత్రి క్వాజ్ మహమ్మదు ముల్లా చక్రవర్తి ముందు వైభవోపేతముగ ఆనాటి ఆచారపద్ధతి ననుసరించి వివాహము సంపూర్తి గావించెను. మహమ్మదీయ సాంప్రదాయానుసారము దారా తన భార్య కియ్య వలసిన నిఖాధనమును అయిదులక్షల రూప్యములనిస్థిరము గావింపబడెను. కల్యాణ మహోత్సవము ఎనిమిది దినములు మిగుల ఆడంబరముగా జరుపబడెను. కడపటిదినము చక్రవర్తి తదితర కుమారులతోను, గొప్ప ఉద్యోగస్తులతోడను, దారా భవనము ప్రవేశించి ఉచిత విందులగుడిచి ఆనందించిరి.

దారా యేక సతీవ్రతుడు. నిరాడంబరుడు. నిర్మలమానస విశుద్ధుడగు ఔరంగజేబును సహిత మొకప్పుడు వివ్యామోహితుని గావించిన సౌందర్యము దారా యెడ వమ్మయి పోయెను. దారా తమ్ముడగు ఔరంగజేబువంటి ఆచారపరు డొకప్పుడు హిరాబాయి యను నొక సుందరాంగిని జూచి ఆమెను యొప్పింప తన శాసన సంకల్ప విరోధమగు సురనుగూడా తన జీవితమున నొక పరి చవిజూచెను. షాజహాను ముంతాజ్ నెట్లు ప్రేమించి సర్వము యామెయేయని భావించెనో, అట్లే కుమారుడగు దారా సహితము నదీరాబేగమును నిక్కువముగా ప్రేమించి అన్యమనస్కుడు గాకుండెను. సౌందర్యాది గుణములకు నదీరా అత్తగారికి

తీసిపోయినదికాదు. తన అర్ధాంగి అస్వస్థత గలిగినపుడు తానే స్వయముగా పరిచర్యచేసినగాని దారాకు సంతృప్తి చేకూరెడిదిగాదు.

సుఖదుఃఖములందు సహితము దంపతు లిరువు రెడబాసి యెరుగరు. వారనుభవించిన యిడుములు వారి యనురాగము నినుమడింపజేసి మిగుల ధన్యతను జేకూర్చెను. దారా నదీరాల సంతాన వివరమును దెలిసికొనినచో మనకథా మననమున కుపయోగ పడును గావున ఆ సంతాన క్రమమిందు బొందు పరుపబడెను.

1. ఒక కుమార్తె:— ఈమె 1634 వ సంవత్సరము జనవరి 19 వ తేదీ ఆదివారము ఆగ్రాయందు జననమయ్యెను. చక్రవర్తి తన పరివారబృందముతో దారా గృహమునకు జని శిశువును జూచి విందారగించెను. ఆబిడ్డ కొన్ని మాసములకే మరణించుటచే దారా మిగుల వెత జెంది అనారోగ్య వంతుడయ్యెను. షాజహా నీ విషయమును విని భయపడి వజీర్ ఖానను రాజ వైద్యుని నియోగించి తాను తనయుని పరామర్శించుచు విశేష ధనమును దానధర్మముల జేయించెను.

2. సులేమానుషూకో:— 1635 వ సంవత్సరము మార్చి 6 వ తేదీ శుక్రవారమున ఢిల్లీనుండి ఆగ్రాకు

ముంతాజ్‌బేగము తన కుమారుడగు యువరాజునకు సుల్తాను పర్వీజు తనయ యగు నదీరాబేగమును కళ్యాణమొనరించినచో లిగిన దంపతు లగుదురని చక్రవర్తిగారికి సూచించెను. బేగము గారి యిచ్ఛానుసారము పాదుషా వివాహప్రయత్నములు సాగింప మని యాజ్ఞాపించెను. కాని యే మహాతేజస్వరూపిణియగు బేగము తన జ్యేష్ఠనందనుని కళ్యాణ మహోత్సవము జరుప ప్రయత్నించెనో యామె ఆ వివాహసౌభాగ్యముల కన్నులార గాంచుటకు నోచుకొనదయ్యె. 1631 సం॥ జూన్‌నెల 7వ తేదీన గౌహరారాబేగమను కుమార్తెను గని మహారాణి దివంగతురా లగుటయు, భూలోకసౌందర్యభవనమగు టాజ్‌మహల్ నిర్మాణ మునకు చక్రవర్తి అనుజ్ఞలొసగుటయు యీకాలచక్రమున జరిగి పోయెను.

రెండున్నర వత్సరముల యనంతరము చక్రవర్తి ఆగ్రా పట్టణముకు చేరెను. అట్లు చక్రవర్తి ప్రధాననగరము జేరిన తర్వాత దారా వివాహ ప్రయత్నములు మరల ప్రారంభింప బడెను. ముంతాజ్ మహల్ బేగముసాహెబ్ గారు మరణిం చుటచే యామె ప్రథమ తనయ యగు జాహనారాబేగము పెండ్లి ఏర్పాట్లన్నియు జేయ సమకట్టెను. తనతల్లి యుండిన ఎంతటి సన్నాహములను చేసియుండునో అంతకంటే వివాహమునకు రాకుమారి నెక్కుడుగ సర్వసంసిద్ధము జేసెను. పెండ్లి ఖర్చు లకై అంచనావేసిన ముప్పది రెండులక్షల రూప్యములలో పదు నారు లక్షల రూపాయలు జహనారాబేగమే బహూకరించెను.

1632 నవంబరు 11 వ తేదీన పెండ్లికుమార్తె గౌరవార్థమై రెండులక్షల మదింపుగల వస్తు సముదాయము పంపబడెను. ఆవస్తువులను పెండ్లికుమార్తెకు తీసుకొని పోవుటకు జరిగిన ఊరేగింపు ఉత్సవమున నిరంతర దరిద్ర పీడితుడగు భిక్షకాగ్రణ్యుడు సహితము తన కడుపుమాట మరచి ఆ యానందమున పాల్గొనెనన్న యతిశయోక్తి గాదు. ఆ యుత్సవమున దారా యొక్క మాతామహి, అక్కలు, అత్తలు మొదలగువారు సహితము భాగస్థులైరి. ఈ యుత్సవ సాంప్రదాయము జరిగిన మూడు మాసములకు వివాహము ప్రారంభమయ్యెను. భార్య మరణానంతరము వ్యసనముచే కృంగిపోయి ప్రజలకు దర్శనమియ్యని చక్రవర్తి నిండోలగమున దర్బారునకు విచ్చేసి ఇదివరకు లేని సంగీత వినోదకృత్యముల ప్రారంభింప యనుజ్ఞలిచ్చెను. వందలకొలది గాయక శిఖామణులు ప్రజలానందాబ్ధిని నోలలాడించిరి. దారాహస్తములు రక్తకాంతులచే అలంకరింపబడెను. నటీమణులు సుబేదారుల యొక్కయు, గొప్ప అధికారుల యొక్కయు వ్రేళ్లను బంగరు జల్తారు వస్త్రములచే గట్టివైచిరి. తదుపరి తగు గౌరవ బహూకృతులంది వచ్చిన రాజోద్యోగీయులు వెడలిపోయిరి. మరునాటి సాయంకాలము దారా తన నస్వభవనమునుండి యొక ఉత్తమాశ్వముపై నధిరోహించి తన తమ్ములు వెంటరా జనకునినగరునందు ప్రవేశించి చక్రవర్తి పాదములకు నమస్కరించెను. పాదుషా వెలలేని ఆణిముత్యముల హారమొకటి స్వయముగా తన తనయుని కిరీటమునకు.

వచ్చునప్పుడు సుల్తాను పురమను గ్రామ సమీపమున బుట్టెను. ఆ గ్రామమందు యీ జన్మదినోత్సవము బాహుళ్యముగ జరిగెను. చక్రివర్తి తన అనుచరులతో సహా వెళ్లి విందారగించెను.

3. మిహీరుషూకో:— 1638 వ సంవత్సరము జూలై 4 వ తేది బుధవారము జననమంది మరుసటి నెల 9 వ తేదీన మరణించెను.

4. షాక్‌నీహద్ ఖానూబేగము:— 1641 వ సంవత్సరము అగష్టు 26 వ తేదీని జన్మించెను.

5. ముమ్‌తాజ్ షూకో:— 1643 వ సంవత్సరము అగష్టు 6 వ తేదీన బుట్టి రెండు మాసములలో మరణించెను.

6. సిప్పైర్‌షూకో:— 1644 వ సంవత్సరము అక్టోబరు 3 వ తేదీ బృహస్పతివారమున జన్మించెను. చక్రివర్తి ప్రతి శిశువు జననమందినపుడు దారా భవనమునకు ప్రత్యక్ష్యమై రెండు లక్షల రూప్యముల చొప్పున జన్మ దిన మహోత్సవమున కొసగుచుండెను.

7, 8. సిప్పైర్‌షూకో తర్వాత జహాన్‌జేబ్ బేగము అమల్‌టన్ ఉన్నిసాలను ఇరువురు కుమార్తెలు కలిగిరి. దారా అనంతరము ఇరువురు కుమార్తెలు మాత్రము దారా

వంశాంకురముగ నిలచిరి. అమర్ టన్ ఉన్నిసా బేగము ఔరంగజేబుచే గారాబముగ పెంచబడి అనేక యాభరణ ముల బహుమతి నందెను. జహాన్ జేబ్ బేగము జాహానారా పెంపుడు బిడ్డయై ఔరంగజేబు కుమారుడగు మహామ్మదు అజామ్‌న కిచ్చి వివాహము గావింపబడెను.



# మూడవ ప్రకరణము

## దారా - రాజప్రతినిధి - కొంచెపహోరు యుద్ధము

1633 వ సంవత్సరము అక్టోబరు 6 వ తేదీన చక్రవర్తి గారి జన్మదిన మహోత్సవమున దారాకు మొదట 6000 అశ్వదళముపైనను 12,000 కాల్బలముల పైనను మనసబ్దారి యియ్యబడెను. ఇంగ్లండు దేశపు యువరాజు ప్రిన్స్ ఆఫ్ వేల్సు అనియు హైదరాబాద్ యువరాజు ప్రిన్స్ ఆఫ్ బీరారు అనునట్లు మొగలుల కాలమున భారత దేశపు యువరాజు ప్రింస్ ఆఫ్ పంజాబు అనియు లేక పంజాబు దేశపు రాజప్రతినిధి యని పిలువబడుట గలదు. ఆ గౌరవస్థానము సహితము దారాకాదినమే యొసగబడెను. దారా పొందిన మహోన్నతదశ నంత శీఘ్రకాలమున మొగల్ రాజకుటుంబమున నెవరును పొంది యుండలేదు. ఐదు సంవత్సరములలో నతడు 10,000 వేల అశ్వదళములకును 20,000 పదాతి సైన్యములకును నాయకుడయ్యెను. 1656 సంవత్సరమునాటికి 40,000 అశ్వసైన్యములకు దారా యధిపతి యయ్యెను. సోదరులగు షూజా ఔరంగజేబుల రెండు సైన్యముల కన్న దారా బలమే గొప్పదయ్యెను. సోమరి యగు షూజా కంటె అనుజుడగు ఔరంగజేబు తన ధైర్యస్థైర్యముల వలన గొప్పవాడు కాగలడని సూచించెను. గాని పాదుషా గారి అపార ప్రేమవాహిని జ్యేష్ట నందనుని

సైన్యమున్నందున తాను రోగగ్రస్థుడు గాక మునుపే దారాను 50,000 కాల్బలమున కధిపతిగను, రోగ నివారణానంతరము 40,000 అశ్వికదళమునకును 60,000 పదాతి సైన్యములకును నాయకునిగ జేసెను. షయిస్టఖానునికి బదులు దారా అలహాబాదునకు 1645 జూన్ 15 వ తేదీన సుబేదారయ్యెను. దారాకు బదులు బాకీబేగ్ అను కొజ్జా అలహాబాద్‌ను పండ్రెండు వత్సరములు చక్కగ పరిపాలించెను. ఈ ద్వాదశ సంవత్సరములలో దారా ఒకపరి మాత్రము కాశీ పట్టణమునకు వచ్చి యేబది ఉపనిషత్తుల తర్జుమా జేయించెను. దారాకు నలహాబాదనిన హిందూమత ధర్మసూత్రములకు నిలయమనియు, షేక్ మహబూబుల్లా యను ముస్లిముమహాత్ముడు నివసించు ప్రదేశమను గౌరవము దప్ప తదితర ప్రాముఖ్యత అతనికేమియు నగుపడలేదు.

దారా అలహాబాదు రాజ ప్రతినిధి యైన రెండు సంవత్సరముల యనంతరము అతడు పంజాబునకు గూడ నధిపతి యయ్యెను. లాహోరు పట్టణమున నతడు చాల దినములు నివసించెను. ఆపట్టణ సౌందర్యమునకై దారా యనేక కట్టడములు గట్టించి ప్రజల మన్ననలకు పాత్రుడయ్యెను. నేటికిని విశ్వఘాతక ప్రజా ప్రపంచము దారా యొక్క ఔదార్యాది గుణములు మరచిపోయినను లాహోరు పట్టణమందలి అనేక కట్టడములు దారాను మరచిపోకుండ ఇప్పటికి సాక్షిభూతమ్ములై తమ శాశ్వతత్త్వమును ప్రకటించుచునే యున్నవి. అప్పటనే ఔరంగజేబు

గట్టించిన బాదషాహీయను మశీదు కలదు. అది బహురుధిర ధారలపై నిర్మింపబడుటచే నా ముస్లిమ్ముల ఆలయమును గూర్చి మెచ్చునకై ముచ్చటించు వారెవరును లేరు. పాప ఫలమెప్పటి కైన పుణ్యకార్య సంపాదితశాశ్వతకీర్తిచంద్రికలముందు తృణప్రాయమై, తుచ్ఛమై, హేయమై దుర్మార్గ ప్రతిబింబఫలకమై యొప్పుననుటకు ఈ లోకమున కీఒక్క తార్కాణమే చాలును. లాహోరు దారాకొక పుణ్యక్షేత్రమై చూపెట్టెను. మహాత్ముడగు మియాను మీరనునతడు ఇచ్చట గతించుటచే నతని పేరొక సౌధము నిర్మించి తన అర్ధాంగియగు నదీరా బేగము భౌతిక శరీరమును సహిత మిందు సమాధి చేయించెను. దారా కొన్ని దినములు గుజరాతు, ముల్తాను, కాబూలు మొదలగు ప్రదేశము లకు సహితము రాజప్రతినిధి యయ్యెను. ఇన్ని ప్రదేశముల కతడు రాజప్రతినిధి కృత్యముల జేయవలసియుండినను అత డెప్పుడు గాని ఆ ప్రదేశములను స్వయముగ దర్శింపక నితరుల నియోగించి పరిపాలించెను. అందువలన యువరాజు రాజ్య పరి పాలనానుభవ పరిజ్ఞాన హీనుడై షాజహాను కృపారసామృత ధారలచే పెరిగిన సుఖఫలితము దుఃఖరూపము ననుభవింపవలసి వచ్చెను. ఇతనికి కాశ్మీరు, కాంగ్రి, పంజాబు దేశములందు విశాలమగు జాగీరు లేర్పరపబడుటయే గాక సంవత్సరమునకు రెండుకోట్లా డెబ్బదియైదు వేల రూప్యములు ఇవ్వబడు చుండెను. ఇదియేగాక ఢిల్లీ ఆగ్రాల సంరక్షణాధికారిగా వత్స రమునకు 22½ లక్షల రూపాయలు లభించుచుండెను. జనకుడు

తన అపార ప్రేమకు పాత్రుడైన దారాకు సమస్త సంపదలనిచ్చెనే గాని ప్రపంచానుభవము, యుద్ధనిపుణత, రాజనీతి నేర్చుకొనుటకు సమయము గల్పింపక సదా తన సామీప్యమునే నుంచుకొనుచుండెను. తన పితృవాత్సల్యమే సుగుణోపేతుడగు దారాకు తుదకు పిడుగగునని అతడూహింపలేక బోయెను.

ఆఫ్ఘనిస్థానమునకు కాందహారు పురాతన ముఖ్య పట్టణము. 1522 సంవత్సరమునుండి 125 సంవత్సరములకు లోపల కాందహారనేక చేతులు మారెను. పారశీకమునకును భరతఖండమునకు మధ్య ఈ నగరముండుటచే తమతమ రాజ్యముల సంరక్షించుకొను ఈ పురము ముఖ్య సూత్రి మయ్యెను. కాందహారు కొంతకాలము పారశీకుల చేతులందును కొంతకాలము మొగలాయిల స్వాధీనముననుండుట తటస్థించుచుండెను. ఇట్లుండ 1642 సం॥ నొకనాడు పారశీక చక్రివర్తి యగు షాఅబ్బాసు ప్రబల సేనాసమేతుడై తన నాయకుని కొంత సైన్యముతో ముందు పంపి వెనుక తానును కాందహారును ముట్టడింప వచ్చుచుండెనని వార్త మొగలులకు వినవచ్చెను. ఈవార్త వినినదే యుద్ధనిపుణత యిప్పుడైనను సంపాదింప యవను దొరికినది అని దారా జనకునాజ్ఞ బడసి యుద్ధమునకు బయలుదేరెను. ఇతనివెంట రుస్తుముఖాన్ బహదూర్ రాజా జయసింగు రాజాజసవంతసింగు లాదిగా గల యోధులు బయనమయిరి. కాందహారు జేరునప్పటికి పారశీక చక్రివర్తి సైన్యసమేతుడై

వచ్చి దారియందే రోగగ్రస్థుడై యుద్ధయాత్రకు బదులు పరలోకయాత్ర చేయుటచే దారా చేయునదిలేక తిరుగ లాహోరునకు వచ్చెను. దారా విజయవీరుల బొందు గౌరవ ఆహ్వానములనే బొందెను. అయిదు సంవత్సరముల తదనంతరము కాందహారుకొరకై జరిగిన రెండు యుద్ధములందును ఔరంగజేబు పరాభూతుడగుటచే దారా తానే బోవ సమకట్టెను. కాందహారువలన వత్సరమునకు పదునైదు లక్షల రూప్యములే పరమాసమున్నను దేశ సంరక్షణకు ప్రధానమైనదగుటచే యుద్ధ ఖర్చులకు వెనుదీయక ఇన్ని పర్యాయములు మొగలులు యుద్ధసన్నిధులగుటకు బూనుకొనిరి.

కాందహారుశత్రుగతమౌట మొగలాయిరాజ్యమునకు లోప మని దారా భావించి యుద్ధసంభారములను మిక్కుటముగా సమకూర్చుకొనెను. దారారాజేంద్రునకు స్వప్నములయందు చాలా పిచ్చి నమ్మకము గలవాడగుటచే కాందహారు తనకు హస్తగతమైనటుల కమ్మని కలలు గాంచుచుండెను. ఒకనాడిద్దరు పకీరులు పర్షియా దేశ చక్రవర్తి మరణించినట్లు స్వప్నము గాంచినట్లు చెప్పిరి. అందులకు తగినట్లు కాకతాళీయముగా షాఅబ్బాసు మరణించినట్లు తెలియుటచే దారాకు స్వప్న వృత్తాంతములు సత్యేతరములు గావని భావించెను.

సమర సన్నాహమునకై నిచ్చెనలకై 10 గజముల పొడవుగల 6,000 వెదురులు సైన్యమునకు ఆహారము సరఫరా

చేయు వైశ్య సమూహము మూడు పెద్ద శతఘ్నులు పదినేడు చిన్న ఫిరంగులు పదునాల్గువేలా, వెయ్యిన్ని అయిదు తుపాకులు అయిదు నూరు మణుగుల తుపాకి గుండ్లు అందులకు తగిన మందు ఐరోపియను ఇంజనీర్లను సమకూర్చెను. అంతియే గాక కాందహారువంటి నమూనా కోట నిర్మించి దానినెట్లు ఢీకొని పడగొట్టవలెను అనుతరిపీదుపొందుటకై తగు పరిశ్రమా అవకాశమును గల్పించెను. తరువాత 70,000 వేల గుఱ్ఱపు దళము, 110 ముస్లిము 58 హిందూ సైనికాధిపతులు, 5,000 తుపాకి సైన్యములు, 3,000 విలుకాండ్రు, 10,000 పదాతి సైన్యము, 230 యుద్ధ గజములు, 6,000 అగడ్తలు త్రవ్వువారు 500 మంది శిలానిర్భేదులు, 500 మంది జలవాహకులతో దారా 1653 ఫిబ్రవరి 11 వ తేదిన కాందహారునకు బయలుదేరెను. పాదుషాగారాసమయమున యువరాజున కనే కాభరణములు అయుధములు, గజములు, 5 లక్షల రూపాయలుమతింపు గలిగిన ఉత్తమాశ్వములు, ఒక లక్ష బంగారు మోహారీలు యుద్ధపు ఖర్చులకు ఒక కోటి రూప్యములు సైనికోద్యోగియుల బహుమతికై యిరువది లక్షల రూపాయలు తదితర వస్తువుల నిచ్చి బంపెను. యుద్ధవీరులు విజయము సంపాదనలేకన్న ప్రార్థనాధికములు, మంత్ర తంత్ర మహేంద్రజాల తతంగములే యెక్కుడుగా శతృవుల యోటమికి దోడుపడునని దారా నమ్మకటచే నతని వెంట ప్రార్థనకు ముల్లాలు శత్రువుల ఆహారము పురుగులై పోవుటకును, విరోధుల ఐకమత్యము చెడుటకును

దుర్భేద్యములగు శత్రుకోటల గోడలు కాలుచున్నలక్కవలె నమసిపోవుటకును భూతముల రప్పించెదమన్న మహామంత్ర జ్ఞుల సహిత మతనివెంట తీసుకొని వెళ్లెను. అనగా దారా దైవమును దయ్యమును, యుద్ధభూమికి ఆహ్వానింప దలంచెను.

కాందహారు నాదర్షాచే సర్వనాశనము గావింపబడుటకు మున్ను పట్టణము మూడు భాగములుగా భాగింపబడియుండెను. అందొకొక్క భాగము శత్రునిర్భేద్యమైయుండెను. లాకా అను పర్వతదుర్గము మృణ్మయనిర్మితమగు బలమగు గోడలచే ఆవరింపబడియుండి విపనివీధులు రెండు భాగములకు చుట్టును బ్రహ్మాండమగు కోటగోడలు అగడ్తలు నిర్మింపబడియుండెను.

కాందహారు చేరిన మొదటిదినమే కొందరుపారశీకులు కోట వెలుపలకు వచ్చి తుపాకులు ప్రేల్చజొచ్చిరి. క్వాజాఖానను నొక మొగల్‌నాయకుడు వీరి కోటలోనికి దరిమి దారాచే విశేషమన్ననలు బడసెను. అదిమొదలు ప్రతి దినము రాత్రులందు పరిషియస్లు మొగలులపై బడి నిదురలోనున్న వారిని దీర్ఘ నిద్ర బొందింపజేయుచుండిరి. మొగలులెంత జాగరూకులైయున్నను, రాత్రులందు పారశీకులచే మోసగింపబడి అపార నష్టమునకు గురియగుచుండిరి. కావున దారా మాంత్రికుల శరణుజొచ్చెను. ఇంద్రగిరి యనునొక మాంత్రికుడు తాను నలుబది భూతప్రేత పిశాచముల కధిపతినని జెప్పి అతనికి

కావలసిన ధనమును ఒసగిన తను కాందహారు కోట గోడలను తనభూతముల సహాయముచే యెండినపత్రములవలె క్రిందికి పడిపోవునట్లు చేయుదునని చాటించెను. దారా, మాంత్రికుని తన సామర్ధ్యమును చూపమని గోరినప్పు డతడు కోట సమీపమునకు జని కోటలోనికి తన్ను రానిమ్మని పారశీకులను కోరగా వారతనిని తీసుకొని వెళ్లి అతని చర్య లనుమానించి నిజము వక్కాణింప యతని విచిత్రహింస జేయసాగిరి. ఇంద్రిగిరి, తనకు లోబడిన వని యనుకొనిన పెనుభూతములకంటె పారశీక నరపిశాచముల బాధ యెక్కువగుటచే తాను వచ్చిన కార్యమును గూర్చి సత్యమును వచించెను. పారశీకనాయకుడీ వార్త విని మొగలుల దరుముటకు తన మంత్ర శక్తిని వినియోగించమని ఆజ్ఞయిడెను. ఆ భూటకపు మాంత్రికుడావని చేయలేనందుచే అతడు నొక పర్వతశిఖరమునుండి క్రిందికి దోర్రియబడెను. హాజీయను మరియొక మాంత్రికుడు దారాను సమీపించి శత్రువర్గపు శతఘ్నుల మూడు గంటల కాలము ప్రేలకుండ జేయుదునని శపథము చేసెను. అతనికి దినమునకు ఇరువది రూప్యములు ఇయ్యబడెను. హాజీ మరునటిదినము సైన్యముల సమీపించి కోటగోడల చూర్ణము చేయుదునని ప్రగల్భముల బల్కి, తన ప్రయత్నము సాగింపుమని గోరినప్పుడు, కోటను కాపాడు చుండిన మూడు పిశాచములు చాల దుష్టపిశాచములగుటచే నయ్యది లోబడలేదని తప్పుకొనెను. ఒక యోగి నలుబదిమంది

శిష్యులతో వచ్చి తన మంత్రశక్తిచే ఇరువది దినములలో కోట స్వాధీనమగునట్లు చేయుదునని జెప్ప, దారా యతనికి దినమునకు నూరు రూపాయలిచ్చు నట్లుత్తరవు జేసెను. అయోగి ప్రార్థనా మిషచే అరణ్యసమీపము చేరెను. కొందరు కాశ్మీర బ్రాహ్మణులు దారాను దర్శించి విహంగమువలె నెగిరిపోవు విమానములు జేయుదుమని నచ్చజెప్పి విశేషధనము పుచ్చుకొనిరి. కాని విమానము గాని యెగిరిపోవుటలు గాని జూచినవారు లేరు. ఇట్లు మంత్ర తంత్ర మహిమలు వట్టి బూటకములై పోవుట గుర్తెరిగి మరల యుద్ధము చేయ ప్రకటించెను. జిహ్వానుండి వెలువడు మాటలు హృదయమున ప్రతిబింబితములేని కల్లమాటలే యెక్కుడుగ సరకుగొని నిజమగు యుద్ధవీరుల గౌరవింపక బోవుటచేతను, తనయుద్ధభూమియందు వీరులమధ్య ఐకమత్యము లేకపోవుటచేతను బస్తీ, గిరీష్కు అను రెండు కోటలు మాత్రము మొగలులకు స్వాధీనమయి కాందహారు ముట్టడి మాత్రము విఫలమయ్యెను. కొండను త్రవ్వి ఎలుకను పట్టిన చందమున ఫలితము శూన్యనిధారనిర్వీర్యత నొంది దారా వెనుదిరిగి ఆగ్రా పట్టణము చేరెను. పాదుషా యువరాజుపైగల అపారప్రేమవలన దారాను మిక్కిలి గౌరవించెను. తుదకు కాందహారు ముట్టడీవిధముగ చక్రవర్తి బొక్కసమునకు అపార నష్టము, ప్రతిష్ఠకు లోపము దప్ప తదితరలాభములేదయ్యెను.

# కాందహారునకు దారా ననుసరించిన సైనికోద్యోగియులు

1) మహాబత్‌ఖాను : 5000 అశ్వదళ నాయకుడు.
2) కిత్‌చిఖాను : 5000 అశ్వదళ నాయకుడు.
3) జాపర్‌ఖాను } యువరాజు అంగరక్షకులు
4) మీర్‌ఆటిష్‌ఖాను } తుపాకిదళనాయకులు.
5) అబుల్లాఖాను } యువరాజు అంగరక్షకులు
6) మీర్‌బక్షిఖాను } పదాతిదళనాయకులు.
7) ఖాసిమ్‌ఖాను : 4000 అశ్వదళనాయకుడు.
8) మిర్జారాజాజయసింగు : 5000 అశ్వదళనాయకుడు.
9) ఇకలస్‌ఖాను : 3000 అశ్వదళనాయకుడు.
10) ఖాల్‌ఖాను }
11) చంపత్‌రాయ్ బుందేలరాజు } పదాతిదళనాయకులు.
12) సైయ్యదు, మిర్జా, తదితరులు }

# నాల్గవ ప్రకరణము

# దారా పారమార్థిక చింతనము

దారా వివాహమైన సంవత్సరానంతరమున నాదిరా బేగము ఒక కుమార్తెను గనుటయు, నా బిడ్డ మరణించుటయు యిదివరకే తెలిసికొంటిమి. దారా శిరీషకోమల హృదయు డగుటచే శిశుమరణ వార్తచే శోక విషాదాబ్ధిలో మునిగిపోయెను వేదాంతశీతల భావమున దప్పనీదుఃఖానలము చందన చర్చలతో చల్లబడినదికాదు. కావునరాజదంపతులిరువురు లాహోరునందుగల మహానీయుడు అబ్దుల్ ఖాధర్ గిలాన్ శిష్యుడగు మియాన్‌మీర్ అను ముస్లిము భక్తుని ఆశ్రయించిరి. ఈ విశుద్ధాత్మ మహాత్మ్యము నెఱిగి చక్రివర్తి సహితము మూడు పర్యాయములు ముస్లిము మునీశ్వరుని దర్శించియుండుటచే వేదాంత ప్రియుడగు దారా పరలోక విషయసంగ్రహణార్థమై అనేక మత గ్రంధముల పఠింపసాగెను. వివాహమునకు తత్పూర్వము ఒక దేవదూత తన స్వప్నమందు దర్శనమిచ్చి యేరాజాది రాజున కిదివర కియ్యబడని అమూల్య వరమును సర్వేశ్వరుడు నీకిచ్చెనని జెప్పి యదృశ్యమైనటుల దారా తన దినచర్యయందు వ్రాసిన విషయము నిక్కువమయ్యెను. దారా కప్పటినుండియు పారమార్థిక చింతయందే నభిలాష యెక్కువయ్యెను. మియాన్ మీరాతో సంభాషించినది మొదలతనికి రాజ్యతృష్ణ సన్నగిల్లెను. యువరాజునకు దైవచింతకు దోడు మంత్ర తంత్ర మహేంద్రజాల

విద్యలయందు సహిత మెక్కుడు ప్రీతియసుట కాందహారు యుద్ధసమయమునందే గ్రహించితిమి. షాజహాను యొక దినమున నిండోలగమున నున్నప్పుడు షేక్‌నజీర్ యను నొక మాంత్రికుడు ప్రవేశించి శుద్ధజలమును మధువుగను, ఒకకూజాను అదృశ్యమగునట్లును, ఒకచిన్న వస్త్రమును పావురముగను, ఒక గడ్డిపోచను సర్పముగను మార్చుటేగాక అందరును జూచు చుండ మాంత్రికుని శిరము వేరై మరల జేరుటయు, అతని నల్లని మీసములు తెల్లనై మరల కృష్ణవర్ణమును దాల్చుటయు జూచి పాదుషా మొదలు పకీరువరకు ఆశ్చర్యమగ్నమానసులైరి. అప్పటినుండియు దారాకు మంత్ర తంత్రములపై నెక్కుడు నమ్మకము గలిగెను.

దారా తన జీవితమున నెక్కుడుభాగము మహాత్ముల ప్రధాన సూక్తులను, మతగ్రంథముల సమైక్యతాభావముల సమ కూర్చి వ్రాయుటయందు గడెపనన్న నతిశయోక్తి గానేరదు. దారా షూకో క్యాజామియానుడ్డీను అను మహానీయునికి దాసాను దాసుడై పరివర్తించెను. జనకుడు చక్రవర్తి సోదరి జహానార సహితము మియానుద్దీనుని యనుచరులయిరి. నరకలోక ద్వారము లను బొత్తిగా మూయించి స్వర్గలోక ఆహ్వానమునకు పాపికి సహితము అర్హత గల్పించు ప్రయత్నమే మియానుద్దీను ముఖ్యసిద్ధాంతము.

దారా యితరమత సంప్రీతి గలిగి యుండినను మహమ్మదీయ మత సిద్ధాంతములపైనయే యవిశ్వాసము గలిగియుండెను. మహమ్మదుప్రవక్తయనిన యాతని కెక్కుడుభక్తి ప్రవక్తపీడను గాని అతనిపై యేకీటకముగాని వ్రాలుట చూచినవారు లేరని దారా దృఢనమ్మకము. ఆత్మ గాలికంటెను సూక్ష్మమైనదనియును, అట్టి ఆత్మచలనమునకెట్టి విరోధము గల్పింపగల ప్రబలశక్తి మరేదియు లేనప్పుడు ప్రపంచ విఖ్యాత నాయకుడగు మహమ్మదు ప్రవక్త స్వర్గలోకమునకు తన భౌతిక శరీరముతో నడచిపోయెనన్న ఆశ్చర్యము లేదనియును యువరాజు దలంచెను. భగవంతునికిగల శతసహస్రాదినామముల అల్లాయను పేరే సువ్యక్తమైనదని యతడు భావించెను. అగోచరమగు మానవశక్తి నిర్మలత్వము బొందుటకే అస్థిపంజర ప్రవేశ మొనరించెననియు, ప్రవక్త సహితము ప్రాణాయామసూత్రానుబద్ధుడై హీరా యను గహయందు తపోనిష్ఠాగరిష్ఠుడై యున్నప్పు డనంత జ్యోతిని జూచి ప్రశాంతనినదము వినగలిగెననియు దారా వ్రాసియుంచెను. వస్త్రధారణగాని కుటుంబ విసర్జనముగాని పరమాత్మని ప్రార్థనకు సోపానములు గావనియు; అనంతమగు ప్రేమ, ఉదారత, నిరంతరానందము, సంతృప్తియే భగవంతునికి గావలసిన పూజాద్రవ్యములనియు; సర్వేశ్వరుడు సర్వమానవుల స్వర్గలోకమునకు అతిథిగ బిలువ బ్రయత్నించుచున్నాడేగాని, శిక్షార్హులుగ భావించుట లేదనియు దారా దలంచెను. యువరాజు

వస్త్రము గదిలింపక అల్లానామము జపించుటచే నాల్గు దినములలో తనలో ననంతమూర్తిని చూదగలిగితినని తన గ్రంథమున వ్రాయించెను. రారాజయినను దారా విజ్ఞానాబ్ధితరంగ డోలికలు ప్రపంచ ప్రశాంతికై యెంతటి శాశ్వతహాయిని గలిగించినవో అతని వ్రాతలలోని ఈదిగువ కనిన క్లుప్తసారాంశము దెలిపించగలదు.

## దారా సూక్తులు

1. సర్వేశ్వరుని సందర్శనార్థమై సువ్విళ్లూరుచుండు భక్తులసంఖ్య యెంతగలదో భగవంతుని జూపుటకు అన్ని మార్గములు కలవు. కాని ఆమార్గములన్నియు ఆ యనంత మూర్తి సామీప్య సాన్నిధ్య సంప్రాప్తమునకే త్రోవ చూపుచున్నవి.

2. తన్నుతానెరిగినవాడు భగవంతుని తెలియగలడు.

3. భక్తి విజ్ఞానమువలనగాని ఒకరి ప్రబోధము వలన గాని లభ్యపడునదికాదు. ఆ యనంతమూర్తి కరుణా విశేషముచే హృదయములో కలిగిన దివ్యజోతివల్లనే భక్తి గలుగుచున్నది.

4. మానవుడు పేరుతెలియని, ఉన్నచోటెరుగని, గ్రామమును సమీపముననే ఉంచుకొని దానిని వెదకుకొనుచునె జీవితమంతయు వ్యర్థము చేసుకొనును. ప్రపంచపర్యటనము జేసి

వెదకుచున్న ఆ గ్రామము హృదయమునందే గలదు. మాయ యను ముసుగును జ్ఞానముచే దొలంగింపవలెను.

5. నా స్వయంకృషిచేతను సామర్థ్యముచేతను సర్వేశ్వరుని సమీపింపలేనైతిని. ప్రభువుయొక్క దయాంతఃకరుణలు లేనిది అనంతమును జేరలేము.

6. సర్వ మతదేగాని నేను అణుమాత్రిడనుగూడకాను. సార్వభౌముడైనైయుండియు ప్రపంచమున తానెట్టి స్వల్పమో యెరుగగలిగితిని.

7. ఓనా ప్రేమమయమూర్తి! నీవేప్రేమ, ప్రేమించువాడవు ప్రేమపాత్రుడవు. నేనన్ననో ప్రేమరహితుడను.

8. ఒకప్పుడు పవిత్రతోరము (జన్నిదము) ధరించినది నేనే; విగ్రహారాధన జేసినది నేనే; తుదకు నిన్ను తెలిసుకొని నిన్ను పూజించుచుండినది నేనే.

9. ప్రతి విగ్రహమున ప్రాణము; ప్రతి అపవిత్ర హృదయమున పవిత్రత దాగియున్నది.

10. ప్రభూ! మాలోనికెవరును క్రొత్తగాదు. నీవు దేనినైనను స్పృశించినంతమాత్రమున పవిత్రమైపోవుచున్నది.

11. ఓ మానవా! భగవంతుని సర్వత్ర వెదకుచుంటివి గాని నీవా యనంతజ్యోతిలో యొక్కయణువగుట తెలిసికొనలేవైతివి. సువిశాల సముద్రమున నీటిబిందువుకొరకై వెతకినట్లే నీవా సర్వేశ్వరుని వెదకుచుంటివి.

12. మానవుడు పరిపూర్ణత్వము బొందినపుడు సత్యమే దేవుడనుట తెలియగలదు.

13. ఆర్యావర్త అరణ్యములోనుండి వెలువడినను అహంబ్రహ్మాస్మి శ్రీఅను ఘోష బాగ్దాదుపట్టణములలోని ధూళిలో సహితము ప్రతిఫలించెను.

14. నాశరీరములోని ప్రతి రక్తనాళము భగవంతుని విశ్వాశ ప్రేమపూరితమగు తోరమయినప్పుడు నేను బ్రాహ్మణులు ధరించు యజ్ఞోప వీతము ధరింపనేల.

15. ప్రపంచమే సృష్టికర్తయొక్క యేకత్వ "మని" భావించు మహాపురుషునకు ప్రేమ అనునదియే ఆయుధము. అట్టివారి హృదయము స్వర్గముకంటెను, భూమికంటెను విశాలమైనది.

16. స్వచ్ఛమైననీరు వివిధరంగులుగల గ్లాసులో పోసినపుడు ఆ నీరే వివిధరంగులుగ అగుపడునట్లు ఒక్కటియగు దైవత్వమే వివిధమతములందు అనేక ఆకారములుగా అగుపడుచున్నది.

17. ఓ ప్రభూ కాబామశీదునందును సోమనాథ దేవాలయమునందును, భోజనశాలయందును, పాంథశాలయందును, పానీయమునందును, పానపాత్రయందును, బుద్ధిహీనునందును, మిత్రునందును, గులాబియందును, కోయిలయందును నీవే యున్నావు. స్వచ్ఛందమగు దీపపుకాంతియును దానిచుట్టు పరిభ్రమించు క్రిమియవునీవే.

ఇట్టి మహత్తర సూత్రములు రచించిన దారా రాజకుటుంబమునకు మానికమువలె విజ్ఞానమూర్తియై ప్రకాశించెను. దారా సర్వమతప్రియుడు పెడ్రోజూజార్జి, హెన్రిబిజియో, హీన్‌రిచ్‌రాత్, పాస్టానిలాస్, మాల్‌పైకా, అను క్రైస్తవ మిషనరీలను రప్పించి బైబిలులోని విషయములను వారి మూలమున విని నిర్విణ్ణుడైపోయెను. రాయితోగొట్టినవానిని వెన్నతోగొట్టుము. ఒకచెంపగొట్టినవానికి రెండవచెంప జూపుము-అనునిట్టి యేసుప్రవచనములనువిని పులకాంకితశరీరుడై పోయెను.

అక్బరు చక్రవర్తి రామాయణ భారత, అధర్వణవేదములను పారశీకభాషయందు అనువదింపజేసెను. దారా హిందూమత గ్రంథములలోని తియ్యని ఊటల మాధుర్యమును గ్రోల నిచ్చగించి 'అర్జున దుర్యోధన యుద్ధ' మను పేర భగవత్‌గీతను, వేదాంతనాటకమగు ప్రబోధచంద్రోదయమును వాన్‌దాస్ అను నాతనిచేతను యోగవాసిష్ఠమును ముల్లామహమ్మద్ అను పండితునిచేతను 52 ఉపనిషత్తులను కాశీలోని నూటయేబది పండితుల వల్లను పారశీకమున తర్జుమా జేయించెను.

# దారా స్వయముగా నాలుగు గ్రంథములు రచించెను.

1. సఫినత్ ఉల్ అవ్లియా:- ఇది మహమ్మదీయ మత సంస్కర్తలను గూర్చి తన ఇరువది ఆరవయేట రచించిన గ్రంథము.

2. సకినత్ ఉల్ అవ్ తియా:- ఇది తన మతగురువగు మియానుమీరును గూర్చి వ్రాసిన విషయము.

3. రిహాలాఇహక్ నామా:- ఇందు సత్యములోని సూక్ష్మములనుగూర్చి వివరించబడెను.

4. మజ్ము వాఉల్ బషరెయిన్:- లేక 'సముద్ర ద్వయఐక్యము' హిందూమోహమ్మదీయ మత సమ్మేళనమునకై వ్రాయబడిన గ్రంథము. సృష్టిలోని రహస్యములు యిరుమత సమ్మతానుసారము రచింపబడెను.

దారా యోగవాసిష్టమును చదివి నాటిరాత్రియొక స్వప్నమును గాంచెను. ఆ కలయందు ఇరువురు వ్యక్తులజూచెను. అందొకరు ఋషిపుంగవుడగు వశిష్టుడు, మరియొకడు శ్రీరామ చంద్రుడు. వశిష్టులు దారాను సమీపించి సముచిత గౌరవమున

ఆహ్వానించి 'రామచంద్రా ఇతడు సత్యమగు విజ్ఞానము నభిల షించు మిత్రుడు. ఇతనిని నాలింగనము జేసికొను' మనియెను శ్రీరామచంద్రుడు దారాను ఆలింగనము చేసుకొని ఒక మధుర. పదార్థమిచ్చినట్లు ఆనిదురయందుగాంచి మరుసటిదినమునుండి యోగావశిష్టమును పూర్తిగా యనువదింపజేయుటకు సమకట్టెను.



# ఐదవ ప్రకరణము

# సుఖవత్సరత్రియము



దారా జీవితమున జరిగిన విషాదపరాభవ పరిణామములు రెండు. కాంధహారు యుద్ధమున పరాభవము ఒకటి. రెండవది కిరీటధారణకై జరిగిన విప్లవమున గలిగిన బలిదానము. యువరాజు జీవితమున మూడువత్సరముల కాలముమాత్రమే సుఖదాయకమైనది. ఆస్వల్పకాలముమాత్రమే విధి యాతనిపై కరుణవహించి వేదాంత, సాహిత్య, కళాపిపాసియని యనిపించి ప్రపంచ చరిత్ర యందాతనికి ప్రత్యేకస్థానమిప్పించెను. దారా మయూర సింహాసనాధిపతియైన జనకుని ప్రక్క స్వర్ణమయ సింహాసనమున గూర్చుండి భారతదేశమున కిరువురు చక్రవర్తులా యున్నట్లు భ్రమింపజేసెను. పాదుషా తృతీయనందనుడు దక్కనుకు రాజప్రతినిధి యైననాడే దారా దౌర్భాగ్యరేఖ బైట బడెను. సింహాసనమునకై పన్నబడుచుండిన లోలోని కుట్రలు గగనచుంబిత మొనరించుచు అతిరహస్యము బట్టబయలను సామెతను సార్థకపరుచుచుండె. దారాకు జరుగుచున్న భయంకర సమర సన్నాహముల గూర్చి దెలిసియు రానున్న దుర్దినమునుగూర్చి మనఃక్లేశముతో మనస్సును కృశింపజేయక నిశ్చింతతో వేదాంత రహస్య సమాలోచనమునందును, జ్ఞానవాసిష్ఠాది గ్రంధపఠనమునందును, ఉపనిషత్తుల విశాలవిజ్ఞాన

సముద్రయానంద వీచికలయందు దేలియాడుటయందును, కురానులోని రహస్యాతిరహస్య మతసూత్రముల మననము జేయుటయందును కాలము గడపుచుండెను. కొందరు రానున్న ఆపధలనుగూర్చి దెల్పినను భగవదిచ్ఛావిధానము ననుసరించి అన్నియు జరుగగలవని భావించి సదాపరమార్థకమందే కాలము గడిపిన దారా రాజయినను మృణ్మయనివాసియగు కుమ్మరి పురుగు మట్టినంటక దిరుగాడునట్లు తానీప్రపంచసుఖావిర్భిలా చందనముల నలముకొనక నిర్మలమూర్తియై నిజ సన్యాసియై భగవదాజ్ఞ పరిపాలించుటే తన కర్తవ్యమని భావించినవాడై తనజీవితమును గడిపెను.

దారా తన కుమారుడగు సులేమాన్‌షూకో తొమ్మిది వత్సరములువాడుగ నుండినప్పటినుండియు జయసింగు మహారాజుతో తన సోదరి తనయయగు ఇందిరాకుమారిని తన తనయునకు నిప్పింపుమని వ్రాయుచుండెను. దారా యీ సమ్మేళనము వలన తన కుమారునికి రాజపుత్రుల సహాయము లభించునని దలంచెను. తుదకు దారా యనుకొనినట్లే సులేమాన్‌షూకో వివాహము జరిగిపోయెను. కొందహారు యుద్ధమునందు మీర్జా రాజా జయసింగ్‌నకును తనకును మనస్పర్థలేర్పడుటచే ఆ విరోధమును శత్రువులెట్లు ఉపయోగించుకొందురో యను భయము చేతను తన తమ్ముడగు షూజా కుమార్తె గుల్‌రక్‌ఖానును ఔరంగజేబు జ్యేష్ఠనందనుడగు సుల్తాను మహమ్మదునకిచ్చుటకు

నిశ్చయమైన భీతిచేతను దారా సులేమాను వివాహమును శీఘ్రముగ జేసివైచెను. ఇంతేగాదు; ముస్లిము ప్రింపంచ స్నేహము వాంఛించి జాపర్ ఖాన్ సోదరుని కుమార్తెను సులేమానునకిచ్చి రెండవ పెండిలి గావింప షాజహాన్ స్వయముగా అనుజ్ఞలిచ్చెను.

దారాకు రాజపుత్రులపై నపారకూర్మి. పూర్వము జహాంగీరుతో చేసికొనిన సంధి నతిక్రమించి మహారాణాజగత్ సింగ్ చిత్తూరుకోట పునర్నిర్మాణము చేయజొచ్చెను. ఈ వార్త షాజహాన్ చెవులబడినదే మిగుల కుపితుడై సాదుల్లాఖానున్ని ముప్పదివేల సైన్యముతో చిత్తూరును నేలమట్టము గావింపపంపి తానును దారాతో వెనుక పయనమయ్యెను. దారాకీదండయాత్ర యెంతమాత్రము నిష్టములేదయ్యె. రాణాకీర్తి చంద్రికలు, రాజ్యము సర్వనాశనమైపోవునని యెంచి తండ్రిని బ్రతిమాలి కొంత ప్రదేశముమాత్రమును లోబరుచుకొని రాణాకు యపార నష్టముగల్గింపక వెనుకకు మరలెను, గాని జగత్సింగు విశ్వాస ఘాతకుడై ఔరంగజేబుతో చేరుకొనెను. మానవ హృదయము కృతజ్ఞతా కృతఘ్నతలకు నెలవనుట అసత్యము గాకపోయెను. దారా జేసినసంధి ప్రియత్నములు షాజహానుకెంతేని ప్రీతి గలిగించెను. పాదుషా తన అరువదిఆరవ జన్మదినోత్సవ సంధర్భమున యువరాజునకు రెండు లక్షల యేబది వేల మదింపుగల ముత్యములు, వజ్రములు పొదవిన ఒక కవచమును

ధరింపజేసి నాలుగున్నర లక్షల రూప్యములు మదింపుగల తురాయి నొక్కటి నిండోలగమున స్వయముగ నతని శిరస్త్రాణముపై గట్టి ముప్పది లక్షల ధనమును బహూకరించి, "షా ఇక్‌బల్" అను బిరుదుమునిచ్చి తన సమీపమున గల స్వర్ణసింహాసనాసీనుడగునట్లు నియోగించెను. అంతేగాదు; పాదుషా తన కుమారునికిట్లని వ్రాసెను. "నాయనా! భగవంతుడు నీయట్టి సునందనుని నాకు ప్రసాదించినందులకు మిగుల ధన్యుడను, ఇది మొదలు రాజ్యాంగవిషయములనేదిగాని నీసలహా లేక తీర్మానమునకు రాను" ఈ ఉత్తరము ప్రకారము దారా సమస్తరాజ్యాంగ విషయములందును ఛాగస్తుడై యుండెను. ఆ కాలమున చక్రివర్తి దర్శనము, గావలయుననిన సామాన్యమైనపనికాదు. వత్సరములకొలది పాదుషా సందర్శనార్థమై రాజభవనద్వారమువద్ద పాశ్చాత్య దేశస్థులు మొదలు పండితోత్తముల వరకు గాచియుండుట గలదు. కాని ఊరక కాచియున్నంతమాత్రమున యెన్నివత్సరములైనను దొరలిపోవలసినదేగాని కార్యసాఫల్యముమాత్రము సూన్యమే! కావున దర్బారునందలి నెక్కుడు పలుకుబడిగలవారి నాశ్రయించినగాని చక్రవర్తిదర్శనము లభించుటరుదు. అట్లు పలుకుబడిగల యధికారుల సంతృప్తిజేయవలయుననిన వారికెక్కుడు బహుమానములందింపవలసియుండెను. నవాబు దర్బారునందు మిక్కిలి పలుకుబడి గలిగినవారిరువురు మాత్రమే, పాదుషా అమేయ

కృపారసమునకు పాత్రుడైన దారా ఒకడు; రెండవవాడు మేధా సంపత్తికి పేరుగాంచిన మంత్రిపుంగవుండగు సాదుల్లాఖాను. విధి వెక్కిరించుచున్నప్పుడు వివేకి వివేకశూన్యుడై వ్యర్థపరుడౌనన్నట్లు దారా విజ్ఞానధీరుడగు ప్రధానమంత్రిని యేవగించుకొనుచుండెను. అందువలన షాజహాను అటు కడుపుచిచ్చునకును, ఇటు ప్రజ్ఞకును మధ్య ఉయ్యాలవలె అటునిటు నూగజొచ్చెను. తన పితామహుడగు అక్బరు తన కుమారుడగు సలీము, మంత్రియగు అబుల్ ఫజల్ విరోధము మధ్య క్రుమ్మగ్గిపోయినట్లు ఇతడును నమసిపోజొచ్చెను. ఈ శత్రుత్వమువలన గలిగిన దావానలమున దారా సాదుల్లాలిరువురు బూదియైపోయిరి. షాజహానప్పుడప్పుడు దారా యువరాజ చిహ్నాంకితుడయ్యును సుగుణవంతుల సన్మానించక దుర్మార్గుల దూరముజేయకుండుట మిగుల విషాదకరమని నుడువుచుండెను. చెట్టుచెడుకాలమునకు కుక్కమూతి పిందెలు పుట్టునన్నట్లు దారా దశ బాగుపడవలసినయోగమే యుండినచో సాదుల్లాఖానును తన కైవశము జేసుకొనియుండెడివాడు. అట్లుగాక తనకియ్యవలసిన మంచి జాగీరులను మంత్రిదీసికొని తనకు సస్యశూన్యమగు జాగీరులిచ్చెననియు, ప్రభుత్వము పది లక్షలియ్యవలసియుండినను ఆపైకమునిచ్చుటకు సాదుల్లా తిరస్కరించెననియు దారా తన జనకునకు దెల్పుటయే గాక అతనిని నిండు దర్బారునం దవమానకరముగ మాట్లాడెను. ఈ విషయమును చక్రవర్తి గుర్తెరిగి ఖిన్నవదనుడై "తన క్రింది

ఉద్యోగస్థుల అవమానించుట పురోభివృద్ధికి వేరుపురుగువంటి దనియు సాదుల్లా నీవొక్కని విషయమేగాక నాసమస్త రాజ్యసంపత్తిని వేయికన్నులతో గాచుచుండె" నని దారాకు వ్రాసి, ప్రధానమంత్రికి యువరాజొనర్చిన గాయమును మాన్పుటకై అనేక బహుమానములిచ్చి పంపెను. దారా ఉదారవంతుడయ్యును సాదుల్లాఖానుడు తనకంటె మిక్కుటముగ పాదుషా హృదయము చూరగొనుచుండెనను ఈర్షచేతనే మంత్రిని ద్వేషించుచుండెను.

దారా తనకుగల యపార అధికారశక్తి నెప్పుడును దుర్వినియోగము జేసినవాడుగాదు. ఎవరికిగాని కీడుతలపెట్టినవాడును గాడు. కాని అతనికి యలవడిన సర్వమానవసమాదరణ భావము వలన యుక్తమైనదేదో అయుక్తమైనదేదో, చెడ్డదేదో, మంచిదేదో, నల్లనిదేదో, తెల్లనిదేదో, అమృతమేదో గరళమేదో దెలిసికొనలేకపోయెను. దుర్మార్గులు సహితము తనముందు కన్నీరువిడచిన సహింపలేకబోవుచుండెను. తన తండ్రిచే దర్బారు నుండి బహిష్కరింపబడిన దుష్టుల సహితమాతడు మన్నించి మరల నుద్యోగములిప్పించెను. కడకు మరణదండనము బొందినవారిని సహిత మాతడు దప్పించెను. అట్లు ప్రాణదానము బొందిన కృతఘ్నులలో ముఖ్యడు మాలిక్ జీవనను మానవ రాక్షసుడు. ఈ పాషాణహృదయునిగూర్చి మాచదువురు లప్పుడే మరచిపోకుందురుగాక.

దారా యెందరో రాజులను సహితము కేంద్రప్రభుత్వ ఆగ్రహపాశములనుండి విడిపించియుండెను.

కాశ్మీరుదేశముపై పిచ్చితుగ్లక్ యనంతరము దండయాత్ర వెడలినవారెవరును లేరు కాశ్మీరునకు ప్రధానపట్టణమగు శ్రీనగరు పరిసర ప్రదేశముల భూగర్భము అపారసువర్ణ సౌభాగ్యసమోపేతమని షాజహాను వినుటచే నజబత్‌ఖాను అను సేనానాయకుని ఆప్రదేశ మాక్రమింపబంపెను. కాశ్మీరు నాసమయమున "నాశికావిచ్ఛేదనరంజిని" అను రాణి పాలించుచుండెను. ఆమె విదేశస్థుల ముక్కులఛేదించి బంపుటచే ఆమె కాపేరు సార్థకనామమయ్యెను. నజబత్‌ఖానుడు సేనాసమేతుడై కాశ్మీరు జొరగనే యారాణి అతిచాతుర్యమున ఆసైన్యమును మహదరణ్యమధ్యకు ప్రవేశించునట్లుజేసెను. ఆదుర్గమకాంతార మధ్యమున మొగలుసైన్యము రోగపీడితమై నిర్మూలమయ్యె. చావుదప్పి కన్నులొట్టబోయినదను సామెత ననుసరించి నజబతుఖానుడెటులో దప్పించుకొని గమ్యస్థాన గమనుడయ్యెను. పదునైదు సంవత్సరముల యనంతరము చక్రవర్తి రాణాపైజేసిన రణరంగ విజయోన్మత్తుడై చతుర్భుజ చౌహానుని కాశ్మీరును పాలించుచుండిన పృధివీసింగుపై బంపెను. చతుర్భుజచౌహానుడు రెండు సంవత్సరములు కాశ్మీరరాజును తారుమారు గావించుటచే అతడిక చేయునదిలేక తన కుమారుడగు మేదినీసింగును ఆశ్రితరక్షకుడగు దారా వద్దకును జాహనారాభేగము వద్దకును శరణుగోరి

పంపెను. వారి ప్రయత్న ఫలితముగ చక్రవర్తి సంధికొడంబడి మేదనీసింగునకు గొప్ప బహుమానములిచ్చి బంపెను. దారా యొక్క అపారతరుణా ప్రజ్వలన చంద్రికా ప్రశాంతమహిమచే నశించుపోవనున్న నొక హిందూరాజ్యము మరల ప్రకాశిత మయ్యె.

దారా సార్వభౌమునినోటనాలుకై ఢిల్లీయందుండినపుడు గుటిలాలి సమానసుండగు ఔరంగజేబు దక్కనునందు రాజ ప్రతినిధియై యుండెననుట విదితమే. అతడేలాగైనను తనకుటిల ప్రయత్న పంజరమున యపారసౌభాగ్య సంపన్నుడై గోల్కొండ బీజపూరు రాజ్యముల హరించి ఆ సంపదల తానాశించియుండు సార్వభౌమపదవికి సోపానముగ జేసికొన దలచెను. జనకుదగు పాదుషా తన్ను కాందహారు యుద్ధమునకు బంపక యవమానించెనను దావాగ్నిలోన ప్రజ్వరిల్లుచుండినను కార్యసాధకుడుగాన ఔరంగజేబు నివురుగప్పిన నిప్పు చంద ముననైకి హసించి దక్కనే తన ప్రతీకారమునకు తగిన భవన ముగ నేర్పరచుకొన యాశించి అచ్చటికి మిగుల నుత్సాహ ముతో వెడలెను. రానున్న సమర సన్నాహమునకై గోల్కొండ బీజపూరులను స్వాధీనము జేసికొనదలచెను. గోల్కొండ నవాబగు అబ్దుల్లాకు తుబ్‌షా (తానీషా) మంత్రియగు మీర్ జుమ్లాకు మొగలు కేంద్రప్రభుత్వమున మంత్రి పదవి నిచ్చెద మని ఆశజూపి అతనిని లోబరుచుకొనెను. మొగలు ప్రధాని

సాదుల్లా ఔరంగజేబుయొక్క యుద్యమమునకు దోడ్పడెను. దారా మరల యీ రంగమున ప్రవేశింపవలసివచ్చెను. కుతుబుషాపై నిజముగా యుద్ధమునకు దిగక సైన్యపు హడావడులచే బెదరించవలయుననియు చక్రవర్తి ఔరంగజేబునకు వ్రాసెను. గాని అతడు పాదుషా ఉత్తరముల రహస్యముగ నుంచి తన కింకను యివి చేరనియట్లు నటించి గోల్కొండను జయించి కుతుబుషాను జంపింప ప్రయత్నించి హైదరాబాదును స్వాధీనము జేసికొని గోల్కొండలోని కుతుబ్‌షా కోటను చుట్టుముట్టెను. సాదుల్లా ఔరంగజేబు లిరువురును షాజహానులోని ధనాశ, రాజ్యకాంక్ష, సున్నీద్వేషములను రగొల్పజొచ్చిరి. దారా జాహనారాలు చక్రవర్తిలోని న్యాయదీక్షను ప్రజ్వలింపజేసి, కుతుబ్షాకు జరుగుచున్న అన్యాయము చక్రవర్తికి కళంకముగ ఆచంద్రార్కముగను నిలచిపోవునని జూపెట్టిరి. పాదుషా హృదయము ఆశకు నీతికి మధ్య పాదరసమువలె నటునిటు ప్రవహింపసాగెను. తుదకు న్యాయమే జయించెను.

కుతుబ్‌షాకు చక్రవర్తి ఉచిత బహుమానములంపెను. గాని జిత్తులమారియగు ఔరంగజేబు ఆ గౌరవచిహ్నములు నబాబున కందజేసిన సంధి. షరతులు పలుచబారునను మిషచే సంధి ప్రయత్నములతో కాలముపొడగించుచుండెను. కుతబ్‌షాహీ మాత ఔరంగజేబును సమీపించి నబాబు కుమార్తెను అతని కుమారుడగు సుల్తాను మహమ్మదునకిచ్చి వివాహము గావించు

నట్లు ప్రార్థించెను. కాని విషహృదయుడగు ఔరంగజేబు కుతుబ్షాను తుద ముట్టింప బ్రయత్నించెను. గోల్కొండ నవాబువద్ద తన మరణానంతరము తన సర్వసంపదలు తనకు కాబోవు అల్లుడగు సుల్తాను మహమ్మదునకు జేరునట్లొక ఖరారు పత్రమును వ్రాయించుకొనియెను. అంతేకాదు గోల్కొండలోని శేషసంపదలను హరించెను. కాని కుతుబుషాను బలవంతపరచి వ్రాయించిన పత్రమును చక్రవర్తి రద్దుచేసెను. తండ్రి తనయు లిరువురునకు గోల్కొండలో దొరకిన అమూల్యవస్తువులకొఱకై మనస్పర్థలేర్పడెను. కాని సమయోచిత ప్రజ్ఞాపరుడగు ఔరంగ జేబు సమస్తసంపదలు స్వయముగ పాదుషా మ్రోలనుంచుటకు సంసిద్ధుడైయున్నానని వార్తనంపి దప్పించుకొనెను.

తదుపరి ఔరంగజేబు దృష్టి బీజపూరుపైపడెను. ఇంతలో మహామేధాశక్తిసంపన్నుడగు బీజపూరు నబాబు ఆదిల్షా మరణించుట రొట్టెవిరిగి నేతిలోబడినట్లయ్యెను. ఔరంగజేబీ యదను రిత్తబోనియక ఆదిల్షా సింహాసనాసీనుడు గావలసినవారు నిజముగా హక్కుగలవారు కానందుచే లక్ష్మీకటాక్ష వీక్షణావృతంబైన బీజపూరును ఆగ్రా ప్రభుత్వమున జేర్చుట ప్రజానురంజకమని పాదుషాకు వ్రాసి తాను బీదరు, కల్యాణీదుర్గముల బట్టుకొనెను. క్రొత్తగావచ్చిన గోల్కొండ మంత్రిపుంగవుడమూల్యములగు వజ్రములు, పచ్చలు గోమేధికముల చక్రవర్తి

కిచ్చి అతని మన్ననల బొందినవాడగుటచే పాదుషాను బీజపూరు యుద్ధమునకు నొడబరచెను. కాని మృదుహృదయుడగు దారా ప్రార్థించుటచే చక్రవర్తి వెంటనే బీజపూరు యుద్ధము నాపుజేసి రాజపుత్ర ముస్లీముసైన్యములు ఆగ్రాజేర ఖచ్చితపు వుత్తరువుల బంపెను. చక్రవర్తి యందట్టి విపరీతపుచర్య బుట్టుటకు దారాయే కారణముగాదు! పాదుషా ఔరంగజేబుయొక్క ప్రబల పన్నుగడలజూచి గడగడలాడిపోయెను. తాను తండ్రిని ఎదిరించి అన్నను జంపి సింహాసన మాక్రమించిన పాపఫలితము తన్ను శిక్షింప ఔరంగజేబు రూపమున బుట్టియుండెనని భయపడెను. తాను దక్కనురాజ ప్రతినిధిగా నుండి సింహాసనము సాధించునటుల ఔరంగజేబునకు దక్కనురాజప్రతినిధి పదవి సహితమట్టిదేయని భావించెను. ఔరంగజేబు నాపదవినుండి తొలగదోయ సంకల్పించు సమయమున తానొకటి దలచిన దైవమొకటి దలచెనన్నట్లు తానున్నట్లుండి వ్యాధిగ్రస్థుడయ్యెను.

# ఆరవ ప్రకరణము

# రాజ్యతృష్ణ

ఇస్లాముమతమున కోటకై వశమునకై సరియగు జ్యేష్ఠ వారసత్వహక్కునకు ఖచ్చితమగు శాసనములేనందున ఖడ్గబలము కుటిలత్వముగల ప్రతిరాకుమారుడు సింహాసనమునకై పోరాడ దొడగెను. మతశాసనములేవియు మచ్చునకైన ఖడ్గబలమునకు ముందు బనికిరాకపోయెను. షాజహాను దారాను యెక్కుడుగ ప్రేమింపకపోయియున్నచో సహోదరులలో విప్లవము మొల కెత్తియుండదని కొందరు భావించుచున్నారు. అందు కొంతైన సత్యము లేకపోలేదు. అతని నలుగురు కుమారులు చతు ర్విధములగు గుణములకు బద్ధులైయుండిరి. దారా సర్వమత సముచ్చాయ సిద్ధాంతప్రియుడు. రెండవ కుమారుడు షూజా షియ్యామతావేశి. మూడవ పుత్రుడు ఔరంగజేబు స్వచ్ఛమగు సున్నీసాంప్రదాయుడు. నాల్గవ నందనుడగు మురాదుమత విధ్వంసియై సురాపానము, సుఖము, స్త్రీయే జీవితలక్ష్యమని భావించి జీవించుయువకుడు. కావున వీరియందు సమైక్యత పెంపొందకబోయెను. మహమ్మదు ప్రవక్త అల్లుడగు అలీవంటి సుగుణాత్ముడై దారా వెలసియుండినను రాజ్యపదవికి రణము తప్పేదిదికాదు. హిందూమహమ్మదీయ మతములకు మధ్య వెలసిన విద్వేషఫలితమే యీ విప్లవమునకు కారణము

గాజాలదు. అట్లేయుండియున్నచో దారాకు చాలమంది మహమ్మదీయులు, ఔరంగజేబునకు పెక్కురు హిందువులుతోడై రణరంగ విహారము సల్పియుండెడివారుకారు. దా రా హిందువులకు హిందువై, మహమ్మదీయులకు ముస్లిమై, క్రైస్తవులకు క్రైస్తవుడై, కాలము గడిపెను. కాని దూరదృష్టి సమయోచిత పరిజ్ఞాన హీనుడై మరణవేదిక నెక్కవలసినవాడాయెను. పాదుషాకు దారాయనిన అంతులేని మమత. యువరాజును కారణరహితముగ విశేషబహుమానపరంపరలతో నింపివైచెను. చక్రవర్తి తన ముప్పది వత్సరముల పరిపాలనలో కొన్ని మాసములైనను దూరముగా విడచియుండినవాడుగాదు. యుద్ధనిపుణత లేని దారాను అరువదివేలసైన్యమున కధిపతిగజేసెను. మిగిలిన ముగ్గురు రాకుమారుల సైన్యముల నొక్కటిగ జేసినను దారా సైన్యమే యెక్కుడుగనుండెను. అంతేగాదు యువరాజకుమారుడగు సులేమానుషూకో పండ్రెండువేల సైన్యముగలిగి కాబూలు రాజప్రతినిధిగాను రెండవకుమారుడు యెనిమిదివేల సైన్యమునకు అధిపతిగను యేర్పరచబడెను. పాదుషా యీవిధముగ విధి విధానము ననుసరించి దారాపై నపారప్రేమ గనపరచెను. కాని పాపమాచక్రవర్తికి తనప్రేమ యువరాజునకు ప్రాణాపాయపాశమగునని స్వప్నమునందైన దలచకపోయెను. రాకుమారులు తండ్రికిరీటమునాశించి పెనుగులాడజొచ్చిరి. ఔరంగజేబునకు దారాపై బాల్యమాదిగ విరోధముండెననుటకు కొన్ని తార్కాణములు గలవు.

బాల్యమున చక్రవర్తి యెదుట యేనుగులను పోరాటమునకు విడచిరి. దారా, ఔరంగజేబు, షూజాలు ఆగజముల సమీపముననే అశ్వారూఢులై యుండిరి. ఆపోరాటమున విజయమందిన సుధాకర్ అను గజము బాలుడగు ఔరంగజేబుపై గవియనున్న సమయమున జయసింగు ముందునకురికి ధైర్యముతోనున్న రాకుమారుని గాపాడెను. ఆసమయమున ఔరంగజేబు తండ్రితో "అపాయ సమయమున సహితము మా అన్నలు నిశ్చలులై యూరక నిలుచున్న అపయశస్సుకన్న నామరణము కీర్తికి కళంకముగా నేరదని" నుడివెను. ఈవాక్యాలు దారాను సూచించిన నర్మగర్భితవాక్యాలు.

మరియొక పర్యాయము దారా తాను నిర్మించిన సౌధమునుజూడ జనకుని, సోదరులను ఆహ్వానించెను. చక్రవర్తి మొదలు అందఱను ఒక చల్లని గదిలోనికిఁదొచ్చి దానిసొబగున కచ్చెరువందుచుండిరి. గదికి ఒకటేద్వారముండెను. ఔరంగజేబు లోనికిబోక బైటగూర్చొనియుండెను. పాదుషా తన తనయుని యేకాంతాసీనతకు కారణమరయ ఔరంగజేబు, "జనకా మీరు ప్రవేశించినగదికొకటే ద్వారముగలదు. దారా మిమ్ము లోనికి గొనిపోయి మీ ప్రాణముల కెక్కు బెట్టదలచిన మిమ్ము గాపాడుటకే నిచ్చటనుంటి" ననెను. ఇట్లు ఔరంగజేబు శత్రుత్వమును జూపుటకెన్నెని నిదర్శనములు గలవు. కవీంద్రాచార్య సరస్వతియను పండితుడు హిందువులపైగల యాత్రపన్నును

తీసివేయవలెనని ఉపన్యాసమిచ్చి చక్రవర్తిని, దారాను సమ్మోహితులను జేసెను. దారా ప్రార్థనవలన యాత్రికులపైగలపన్నుల భారము నాటితో రూపుమాసెను. ఔరంగజేబు మహమ్మదీయుల చప్ప తదితరులు సహాయమునకు అనర్హులని భావించెను. దారా హృదయము ధర్మగుణామృత తటాకము, ఔరంగజేబు హృదయము కాలకూటవిషపాత్రము. మూలసూత్రధారుడగు ఔరంగజేబు తన యిరువురు సోదరులతో దారాను పదవీ భ్రష్టుల జేయుటకై మంతనములాడజొచ్చెను. పాదుషాగారి కోరికకు విరుద్ధముగా ఔరంగజేబు తనయన్నయగు షూజాను అలహాబాదునందు గలసికొని యాతనిని తనవానిగ జేసికొనవిందులు గావించి అతని కుమార్తెయగు గుల్‌రక్‌బానూబేగమును తన కుమారుడగు సుల్తాను మహమ్మదునకు వివాహముజేయ నిశ్చయము గావించెను. అట్లే తన తమ్ముడగు మురాదుబక్షును లాలనచే బేలించి తనవశము జేసికొనెను. షాజహానుకు మురాదువలన భయమంతగా గనుపించలేదుగాని షూజా, ఔరంగజేబు కలయిక దారాకు గండమని దలచి వారు జేసుకొనిన వివాహపు యేర్పాటుల రద్దుగావించెను. కాని ఔరంగజేబు తన ప్రయత్నమును విడువడయ్యె. షూజా మురాదులతో నుత్తర ప్రత్యుత్తరములతిరహస్యముగా జరుపుచు ఢిల్లీవార్తలు యెప్పటికప్పుడు కపటసూత్రధారురాలగు రోషినారా, బానూబేగములవలన దెలిసికొనుచుండెను. ఔరంగజేబు మురాదు నొకసారి గలసికొని దారా

హిందూపక్షపాతయనియు షూజా గర్విష్ఠియగు తెలివిమాలిన నికృష్టజీవియనియును మక్కాకు వెళ్లి అల్లానామ జపజీవనము చేయ సంకల్పించియుండుటచే తాను సింహాసనాపదవి గోరుచుం డుటలేదనియు సర్వవిధముల ముస్లిము మతప్రియుడగు మురా దేసార్వభౌమ పదవికి తగినవాడనియు, భారత భూమికి మరల నిష్కళంకమగు మహమ్మదీయ చక్రవర్తిని నియమింప తన నిజ సంకల్పమని నచ్చజెప్పి తనకీనాడోవు మతయుద్ధమున సహా యము జేయునట్లు జేసికొనెను. అంతేగాదు, విజయామైన మరు నాడే, సింధు, కాశ్మీరు, పంజాబు, ఆఫ్ఘనిస్థానముల మురాదు నకు స్వంతజమీన్లుగ నిచ్చునట్లును, "యీ సత్యమగు నానుడువు లకు, నేను పరమేశ్వరుని, మహమ్మదు ప్రవక్తనుసాక్షి భూతులుగా యెన్నుకొనుచున్నా" నని ఒక రహస్య అంగీకార పత్రము సహితము వ్రాసి పంపెను. ఇట్టి నమ్మకము గలిగి నప్పుడు సుఖపిపాసియగు మురాదు నమ్మకుండ నుండగలడా!

ఇట్టి రహస్యపు కుట్రలు దక్షణదేశమున జరుగుచుండ ఢిల్లీయందు సార్వభౌముడు 1657 వ సంవత్సరము సెప్టంబరు ౧౬వ తేది దుర్భరవ్యాధిపీడితుడై సభా భవనమునకుగాని అను దిన ప్రజాసందర్శనార్థమునకుగాని రాలేకపోయెను. దారా తదితర అనుచరులు మాత్రమే చక్రవర్తిని దర్శించుచుండిరి. ప్రజలలో చక్రవర్తి మరణించెననువార్తయొకటి చెలరేగెను. అందువలన

పాదుషా ఒకనాటి యుదయమున రాజభవనమునుండి ప్రజలకు తనదర్శనమిచ్చి ఆ మరుచటి దివసమున సభాభవనమలంకరించి దారా తన అనారోగ్యస్థితియందెంతేని జాగ్రత్తవహించి సేవ యొనర్చినందులకు, ఇదివరకున్న సైన్యముకంటె నెక్కుడుగ పదివేల అశ్వదళమును, పదివేల పదాతి సైన్యములనిచ్చి రెండున్నర లక్షల రూప్యముల బహుమతి నొసంగి ప్రధానోద్యోగులరావించి దారా ను తనకు బదులుగ చక్రవర్తిగ భావింపవలయునని ఆజ్ఞనిచ్చెను.

పాదుషా మరల ఆరోగ్యవంతుడయ్యెనని వినిన తదితర రాజకుమారులకు విషాదము గల్పించెను. చక్రివర్తి ఆరోగ్యము బొందెననుట కల్లవార్తయనియు, షాజహానురూపు గలిగిన మరియొక వ్యక్తిని ప్రిజలకుజూపి దారా కుత్రిమ నాట్యమాడుచున్నాడని ప్రిత్రి వదంతిని ఔరంగజేబు సృష్టిజేసి యుద్ధమునకు ముందు జక్కగ యుపయుక్తమగు పంచమ ఆయుధము (ఫిఫ్తుకాలమ్) ను ప్రిజలపై విసరి విస్తరింపజేసెను. లోకము గుడ్డిదన్నట్లు ఏవార్తను యేవార్త నిజమనినమ్మ ప్రజాసముద్రఘోషను ఢీకొనువారెవరు గలరు. మూడు పువ్వులు ఆరు కాయలుగాయు దినములు రానున్నప్పుడు ఔరంగజేబునకు పట్టినదంతయు బంగారం అగుచుండెను. సోదరి జాహనారా సత్యవార్త ప్రిచారముజేయ యెంత బ్రియత్నించినను సఫలము గాకపోయెను. అసత్యానికున్న యాకర్షణ సత్యవార్తకు లేకబోయెను.

---

# ఏడవ ప్రకరణము

# సోదరుల పోరాటము

సింహాసనమునకై కలవరించుచుండిన షూజాకు తండ్రి అనారోగ్యముతో మరణించెననువార్త తెలియవచ్చెను. వెంటనే అతడు తన ముఖ్యపట్టణమగు రాజమహాలునందు తానే చక్రవర్తి నని మకుటధారినని ప్రకటించి అదివరకే సిద్ధముగానున్న సైన్యములను దీసికొని బీహారురాష్ట్రము ప్రవేశించి ఆగ్రావైపు బయలు దేరెను. పాదుషా తన ఆజ్ఞ విన్నంతనే షూజా మరలిపోగలడని భావించినమాటయినను దారా సంతృప్తికొరకై మనుమడగు సులేమానుషూజాకు యిరువది రెండువేల సైన్యమును రాజాజయసింగును సహాయమిచ్చి పంపెను. సైన్యములు పయనమైనప్పుడు రక్తపాతముగాకుండ షూజాను నయభయములతో వంగదేశ ముఖముపట్టునట్లు జేయవలయునని జెప్పియుండుటచే సైన్యములు సమరసన్నాహ సంబరాక్రాంతులుగాక సరససల్లాప సందోహ మానసులై సమర రంగమువైపు నడువజొచ్చిరి. దారా తీక్ష్ణ యుద్ధము జరుప నుత్తరవులిచ్చెను సైనికదళమునకు యువరాజు నాజ్ఞ యనుసరించుటో చక్రవర్తి హృదయమును సంతృప్తిబర చుటో తెలియక మరాళగమనులైరి. జయసింగు సహితము దారా యాజ్ఞననుసరించి యుద్ధమొనర్చినచో చక్రవర్తి యాజ్ఞ నుల్లంఘించిన నేరమునకు గురియగుదుమేమోయని దలచి బాదుషా నిజయభిప్రాయమెరిగి తనకెప్పటికప్పుడు దెలుపగలం

ములకు తన కుమారుడగు రామసింగ్‌ను దర్బారునందునిచి వెడలిపోయెను. షూజా చక్రివర్తి సైన్యమును జూచి వెరుగందిన వానివలె నటించి తాను దండయాత్రాభిప్రాయము తీరా లేదనుటకు అనేక కుంటిసమాధానముల చక్రవర్తికి వ్రాయుచు దారాకు జేరిన మునిగిర్‌పట్టణ మిచ్చిన సంతసింతునని దెల్పెను. దారా తన తమ్మునికి మునిగర్ నిచ్చుటకు సంతసము దెల్పి పట్టణము స్వాధీనమైనదే కోటను పడగొట్టించమని చక్రవర్తిచే వ్రాయించెను. కాని షూజామాత్రము అట్టి వ్రాతలచే అడ్డగింప బడినవాడుకాడు. అతడు అలహాబాదును సమీపించెను. షాజహాను కప్పటికి తన కుమారుడు పన్నుచున్న కుట్రలనెఱిగి కుపితుడయ్యెను. రామసింగును బిలచి తనఆజ్ఞ నుల్లంగించిన షూజా శిరస్సును బంపవలయునని చక్రవర్తి యాజ్ఞగ నతని తండ్రియగు జయసింగునకు దెలుపమనియెను. జయసింగు మాత్రము చక్రవర్తి వుత్తరవుల పరిపాలించక యుద్ధమునందు విశ్వాస సహితముగ నడచుకొనక తాను ప్రత్యేకతాభావమునే గనపరచుచుండెను. జయసింగ్ నడత ననుమానించి సత్యవిషయమును సులేమానుషూకో పాదుషాగారి కెరుకపరచెనుగాని దారా జయసింగుయొక్క నిజహృదయం బెరుగనివాడగుటచే కుమారుడు నిజమెరుగక వ్రాయుచుండెనని దలచి జయసింగు తప్పక విజయము సమకూర్ప గలడనియు అతని ననుమానించుట ప్రభుత్వమునే యవమానించునన్నట్లని తనయునకుదెల్పి రాజామానసింగు మొగలులకు దెచ్చినయశమే మీరును దెత్తురనునాశతో

ప్రభుత్వమెదురు జూచుచున్నదని జయసింగునకు వ్రాసెను. పాపము సులేమానిప్పుడేమి చేయగలడు. "వినాశకాలే విపరీత బుద్ధి" యన్నట్లు రానున్న మహాయాపద ననుభవింపవలసిన దారాకు పుత్రుని సువచనములు చెవిటికి శంఖూదినట్లయ్యెను.

షూజా కాశీపట్టణము సమీపమున నొక యరణ్యమధ్యమున తన సైన్యముతో విడసెను. సులేమాను తన మిత్రుడగు దలీర్ ఖానను వీరునితో గలసి పినతండ్రి సైన్యములజుట్టుముట్టెను. వారికాహారాదులంబోనీయకుండ జేయసమకట్టెను. గాని గంగానది మార్గముగ షూజాకు వచ్చుచుండెడి యాహారము నరికట్టజాలకపోయెను. కేవలము ఆత్మసంరక్షణార్థమునకో యన్నట్లు యుద్ధముతో తనకేమియు పనిలేనియట్లు నిలచియున్న జయసింగును శత్రువులపై గలియుటకైన సలహా యిమ్మని రాకుమారుడు సులేమాను కోరినను అసంకుచిత హృదయుడగు రాజపుత్రవీరుడు మిన్నకుండెను. ఇంతలో ఢిల్లీనుండి షూజా సైన్యములపైబడి త్వరితగతి విజయము బడయమని వార్తలు వచ్చుటచే సులేమాను యుద్ధసన్నద్ధుడయ్యెను. షూజాకు మధ్యాహ్నమునరకు బంగుకొనియుండుట యలవాటు. "యథారాజా తథాప్రజా" యన్నట్లు సైన్యములు సహితము దోమవల తెరల దగిలించుకొని హాయిగ నిద్రించుటలవాటుజేసికొనిరి. ఈవార్త సులేమానుకు తెలియగనే ఉన్నట్టులుండి పిన్నతండ్రి సైన్యములపై బడెను. షూజాసైన్యములు పరుగిడెను. ఆయుద్ధమున వంగ

సైన్యములకు నోటమి పాదుషా సైన్యములకు విజయము సంప్రాప్తించెను. ఆయుద్ధఫలితముగా సులేమానుకు రెండుకోట్ల రూప్యములు మతింపుగల వస్తుసముదాయము దొరకెను. షూజా నిదురమత్తులోనుండి పైకిలేచి తనగజముపైనెక్కి పారిపోవుచున్న తన సర్దారులను గొంతెత్తి పిలువసాగెను, గాని వారలని యరపు లరణ్యరోదనముగ నెంచినటని దిగవ విడచి వెడలిపోయిరి. దిలీరుఖాన్ సులేమాను లిరువురు షూజా మత్తగజమును దాకిరి తన ప్రభువగు షూజాకు రానున్న ఆపదను కనుగొని ఆభద్రగజ మును మావటీడు దూరముగా దరుముకొనిపోయి షూజా ప్రాణ ముల గాపాడెను. ఈవిజయవార్త చక్రవర్తికి దెలియగనే దారా ఆనందపరవశుడై సైనికోద్యోగీయులకు బహుమానముల బహూకరింపబడునట్లు ప్రకటించెను. రాజ కుమారుడు సులేమాను షూకో ధైర్యసాహసములే యీ విజయమునకు కారణమైనను రాజాజయసింగ్ విజయాగ్రేసరుడని ప్రకటిత మయ్యెను. ''నూరు సంవత్సరముల లోపుగ నింతటి అమూల్యమగు యుద్ధ ఫలితమును దెచ్చినవీరుడే లేడనియు శూరుడగు రాజామాన్‌సింగు కన్న జయసింగే మేటియనియు, షూజా కనురెప్పపాటున దప్పిం చుకొని పోవుటకు గారణము జయసింగే యని ప్రబలినవార్తను చక్రవర్తి హృదయపూర్వకముగ నమ్మటలేదనియు దారా జయ సింగునకు వ్రాతమూలమునదెల్పెనుగాని విశ్వాశఘాతుక ప్రముఖు డగు జయసింగు అట్టివ్రాతలతో మార్గమునకు వచ్చినవాడుగాడు,

కొంపహోరు యుద్ధమున దారా తనకు ప్రాముఖ్యతనియ్యక తురుష్క సరదారులకు తన విరోధియగు జస్వంతసింగునకు ప్రాధాన్యము నిచ్చెనని పగబూనిన రాజపుత్రుడు, వచ్చిన సదవకాశములనెల్ల కాలదన్ని దారాకు ఓటమిదెచ్చుటయందే తన సామర్థ్యమంతయు వినియోగింపసాగెను.

షూజా కాశీనుండి పాట్నానగరమునకు అయిదు దినములలో జేరిపోయెను. జయసింగు షూజాను వెంటాడుచు ఇరువది ఒకటవ దినమున పాట్నా సమీపించెను. సులేమానుషూకోకు కాశీనుండి మార్గము దెలిసియుండినచో షూజాను వెంటాడి అతనిని బట్టుకొని యుండెడివాడు. జయసింగు జేసిన కాలహారణమువలన షూజా తన సంపదలతోను సర్వ సైన్యములతోను బలిష్ఠమగు దుర్గమయకోటలుగల సురాజ్‌గర్ కోటలో దాగికొనెను. ఒక క్షణములో పట్టుబడవలసియుండిన షూజా అతని సంపదలు జయసింగుయొక్క కుటిలత్వమువలన దూరమైపోయెను. త్వరగా యుద్ధపూర్తి జేయమని వచ్చెడి యాజ్ఞల జయసింగు నరకు జేయడయ్యె.

సురాజ్‌గర్‌ను చక్రవర్తి సైన్యము ముట్టడియున్న సమయమున మురాదు ఔరంగజేబుల సైన్యములు దారాసైన్యాధిపతియగు జసవంతసింగును ఓడించి పారద్రోలెనసువార్త జయసింగునకు దెలిసి తన శత్రువగు జసవంతుని పరాభవము తనకు

పండుగగ భావించి అమితానంద హృదయుడయ్యెను. చక్రవర్తి వద్దనుండి షూజాతో సంధి గావించుకొని సులేమానును అలహా బాదునందు విడచి సత్వరముగ రమ్మని వార్త వచ్చెను. జయ సింగు పాదుషా యాజ్ఞను నిర్లక్ష్యముజేసి చాలదినములవరకు మంతనముల జరిపి తుదకు సంధిజేసికొని పెండ్లివారివలె ఆగ్రా వైపు నడకసాగించెను. సులేమాను జయసింగు ప్రవర్తనలో గల కుటిలత్వమును గ్రహించి యతనిని విడచి శీఘ్రగామియైన తన వెనుకనేవచ్చి యెచ్చట కయసింగుపైబడునో యెచ్చటతడు సైన్యములో విప్లవములేపునో యను భయమున జయసింగు సమేతుడై అలహాబాదు జేరెను. సర్వ సైన్యములు అలహాబాదు జేరునప్పటికి ఔరంగజేబు దారాను రెండవతూరి సమూగర్ అను చోట సంపూర్తిగ ఓడించి విజయమును బొందెను. జయసిం గునకీవార్త అమృతగానమై వీనులవిందు గొలిపెను. వెంటనే యతడు తన నిజస్వరూపమును బైటబెట్టెను. సులేమానును విడచి తాను ఆగ్రా ప్రయాణమునకు సంసిద్ధుడయ్యెను. జయ సింగు నడవడింతవరకు క్షంతవ్యమేయని యనుకొనెను ఆతడం తటితో నిలచినవాడుగాడు. సైన్యముల దారాకెదురు దిరుగురీతిబో ధించెను. సులేమానుషూకో రోహిలాల శరణుజొచ్చుటకు ప్రయ త్నించియున్నచో దిలేరుఖానుడు సహితము రాకుమారుని యనుస రించి యుండెడివాడు. కాని ఔరంగజేబు పక్షపాతియగు జయ సింగు మునిగిపోవుచున్న ఓడకు సహాయముజేసియు ప్రయోజన

ముండకబోవుటచే కాక తమ సర్వనాశనమునకు గారణమగు చున్నదని రోహిలాలకు బోధించుటచే సులేమాను రోహిల్ ఖండ వాస్తవ్యుల సహాయ మర్థింపలేకబోయెను. ఇక సులేమాను రా కుమారుని చరిత్ర నిచ్చట విడచి దారా స్థితిగతుల బరికింతము.

నిర్భాగ్యుడగు దారా మహారాజా జస్వంతసింగుపై పూర్తి విశ్వాసముంచి అతనిని అతనితో కాశిమ్ఖానుని మాళవ దేశము నకు బంపి మురాదు ఔరంగజేబుల సైన్యము లైక్యముగాకుండ జేయమని బంపెను. జస్వంతుడు కుటిలాగ్రేసర చక్రవర్తి ముం దెంతటివాడు. ఢిల్లీసైన్యములట్టి ప్రయత్నములకు గడంగునని మున్నె యెరిగిన ఔరంగజేబు జస్వంతసింగు ప్రత్యక్షమగుటకు మున్నె మురాదుసైన్యముల గలుపుకొని జస్వంతుని పైధర్మత్ యనుచోట 1658వ సంవత్సరం యేప్రిల్ నెల 15వ తేది దిన మున ఎదుర్కొనెను. ఆయుద్ధమున కాశిమ్ఖాను అను ముస్లిము సేనాధిపతి ఔరంగజేబు బెట్టిన ఆశలకు లోబడి ఉన్నటులుండి తన సైన్యముల శత్రుబలములతోచేర్చి చక్రవర్తి సైన్యముల నిరోధించి జసవంతుని యోడించెను. జస్వంతుడభిమాన పురు షుడు, అతడు జరిగిన మోసమునకు మిగుల వగచి జోదుపుర మునకు బోయెను. అతని అర్ధాంగి యుద్ధభూమినుండి తిరిగి వచ్చు భర్తను గౌరవసూచకముగ ఆహ్వానింప బ్రయత్నించెను గాని మానధనుడగు జస్వంతుడట్టి గౌరవమునకు పాత్రుడను

గానని ఆహ్వానవినోదముల నిషేధించెను. దారాకీవార్త దెలియు నప్పటికి అతడు బిలోచ్‌పూరునుండి చక్రవర్తితో ఢిల్లీకి వచ్చుచుండెను. ఔరంగజేబుయొక్క జయమును విని పాదుషా భయభ్రాంతిచే వికలస్వాంతుడయ్యెను. తన బొక్కసములోని అపారధనమును దారా స్వాధీనము గావించి విశేషసైన్యముల జేకూర్ప యనుజ్ఞలిచ్చెను. స్వార్థపరులగు కొందరు చక్రవర్తిని జేరి సంధికి బ్రయత్నించినచో తప్పక తన తనయులు లోబడుదురని కుచ్ఛితపు సలహాలియ్యసాగిరి. దారాకీ యుదంతమంతయు దెలియ మిగుల కుపితుడై, సత్రిశాలమహారాజును, జాఫరు ఖాను లిరువురు మురాదు ఔరంగజేబుల సైన్యముల దరుమగల రనియు పిరికిపందలగు విద్రోహులిట్లు అన్యమార్గమును జూపి చక్రవర్తిని చలితాత్మునిగ జేయుచుండిరని నిర్భయముగ జాటెను. ఈపలుకులు శత్రుమిత్రులకు ములుకులైదోప ఆవేశాపరులై పగసాధింప కంకణముగట్టిరి.

చంబల్‌నదీప్రాంతపు రేవులనడ్డగించినచో శత్రువులావాహినికీవలిగట్టు జేరలేరని యువరాజు దలచెను అట్టిపనికి రుస్తుముఖాను సత్రిశాల్ మహారాజువంటి వారిని నియోగించి యుండినచో విజయమేర్పడి యుండుననుట సందేహాస్పదము గాదు. కాని విధివిధానము వేరువిధానముగా నున్నప్పుడు మానవమాత్రుల మానసములట్టి యుపయుక్తమార్గము లనుసరింపజాలవు. ఈయుద్ధమునకు దారా స్వయముగ బయలుదేరి

దోల్పురముజేర సంకల్పించి ముందుగ కొంతసైన్యమును బంపి వారిని బీహారునుండి సులేమాను వచ్చువరకు శతృవర్గమును దాకవలదని యాజ్ఞలిచ్చెను. విశ్వాసపాత్రులనందరిని షూజాతో యుద్ధమాడబంపినందున తన్ను అనుగమించు నమ్మకమగు వారులేరని దారా చింతించకపోలేదు.

యువరాజు డోల్పురమునకు ప్రయాణ సన్నద్ధుడయ్యెను. వృద్ధుటగు పాదుషా గడగడ వడకుచు తన ముద్దుల తనయుని ముస్లిము సాంప్రదాయానుసారము ఆశీర్వదించి పుత్రగాత్రి పరిష్వంగనాభిలాషియై కుమారుని తన వెడద రొమ్మున హత్తుకొని అశేషబహుమానముల నొసంగి ఒక చక్కని రథముపై కూర్చుండజేసెను. హిందువులు ముసల్మానులు వారివారివిధానముచొప్పున ప్రార్థనలు చేయజొచ్చిరి. రణదుంధుభులు మ్రోగ సమరసన్నాహాభిలాషియగు సైన్యములతో గదలిపోవుచుండ పాదుషా గోడకానుకొని తనముసలికన్నులెంతవరకు తనుజూడనిచ్చెనో నంతవరకును జూచుచుండెను.

దారా డోల్పురముజేరి చుంబుల్ స్రవంతీతీరప్రాంతముల గాచుచుండెను గాని కుయుక్తికి పేరుగాంచిన ఔరంగజేబు తన సైన్యముల డోల్పురమునకు నలుబదిమైళ్ల దక్షిణమున నదిని సురక్షితముగా దాటి దారా సైన్యముల వెనుకవైపునకు వచ్చెను. దారా యిక చేయునదిలేక హుటాహుటి ఆగ్రా సైన్యమునకు

యెనిమిదిమైళ్ల దూరముననున్న సామగర్ ప్రాంతమునకు వచ్చెను.

యువరాజు సైన్యము 60,000 మురాదా ఔరంగజేబుల బలము 50,000, దారా సైన్యము లెక్కకు మిక్కుటముగ నున్నను అందర్ధముకూడ దారా సన్నిహితులుకారుఏలన పాదుషా సైన్యమునగల ఇరానియనులు, తురానియనులు దారా యభిమాన పాత్రులగు హిందువుల, రాజుపుత్రుల, సెయ్యదుల భారతజనన ముస్లిముల యేవగించుకొనుచుండిరి. అదియునుగాక దారా యుద్ధానుభవమించుకొనలేక సుల్తానుని స్వర్ణభవనమున పసిడి పంజరములోని చిలుకవలె బెరిగి వేదాంతాది శాస్త్రపఠన ఫలిత ముగ సమగ్రపురుషయత్నములేక యేదైవముపై భారమువైచి మంత్రతంత్రాది మాయలనమ్మిన మాత్రమున విజయము జేకూరునని విశ్వసించుచుండెడివాడు ఔరంగజేబట్లుగా కరణ రంగ విశారదత్వానుభవముగలిగి కుటిలాగ్రేసర చక్రవర్తియై శత్రువర్గసంఘీభావబలమును సన్నగిల్లజేయు కుతంత్రుడై దీర్ఘ దృష్టి, యెత్తునకు పైయెత్తు వేయగల సామర్థ్యముగలవాడు ఒకరు శాంతితత్వవిచారమూర్తి మరియొకరు తేనెబూసినకత్తి! ఔరంగజేబు సామగర్ యుద్ధభూమి జేరుటకు మున్నె దారా సైన్యములోని ముస్లిములు మతోద్రేకపూరితులజేసియు, రాజ పుత్రులకు రాజ్యకాంక్షజూపియు లోలోన యెంతోమందిని తన వైపునకు త్రిప్పుకొనియుండెను. అమాయకుడగు దారాకీ విష యములు తెలియవు ఇక యువరాజు విజయము నిశ్చయమని నమ్మిపెట్లు!

ఔరంగజేబు సైన్యములు సాముగర్ను సమీపించెను. ఆ దినమే దారా సైన్యము అలసిపోయియుండిన శత్రుసైన్యమును దాకియుండినచో విజయము నిక్కవముగ జేకూరియుండును గాని దారా ఔరంగజేబుచే యుద్ధమునకు దలపడినప్పుడు సంగర రంగమున దిగుట పాడియనిదలచెను. నాల్గయిదు దినములు గడచినను తమ్ముడు యుద్ధసన్నద్ధుడుగానందుచే తానే ఆ యినుమ ప్రదేశమున తన సైన్యములనడిపించెను. జాఫరుఖాను శతఘ్నుల సైన్యములతో ముందునడచెను. అందు ఐరోపీయులు సహితముండిరి. వారివెనుక తుపాకులుగల పాదాతిసైన్యము, వారి ననుసరించి 500 లొట్టిపిట్టలు చిన్నచిన్న ఫిరంగులతోడను, వానివెనుక రణకౌశలాశ్రేష్ఠములగు గజములు యుద్ధభూమికి పయనమయ్యెను. వానికి తర్వాత 10,000 వేల అశ్వదళాధిపతులైన సత్రశాల మహారాజు, దావూదుఖానుడును, ద్రోహియగు జయసింగు కుమారుడగు రామసింగు 10,000 సైన్యములతోడను వారిమధ్య దారా యెత్తైన మధగజములపై అధిరోహింప అతని చుట్టు 3,000 విశ్వాసపాత్రులు సాయుధులై నడువ కుడిప్రక్కన విశ్వాసఘాతుకుడగు కలీలుల్లా 15,000 వేల సైన్యముతోడను, యెడమవైపున దారా రెండవకుమారుడైన సిపైర్షూకో విశ్వాసపాత్రుడగు రుస్తుముఖాను ఫిరోజ్ జంగును బయలుదేరిరి.

యుద్ధము ప్రారంభమయ్యెను. పాదుషా పిరంగులు మోతచే రణభూమియంతయు దద్దరిల్లజేసెను కాని ఔరంగజేబు

ఫిరంగులందులకు సమాదానమియ్యనందున వారికి శతఘ్న బలము తక్కువగ నుండునని దలచి దారా కెడమవైపునుండిన దావూదుఖానుడు తన పదివేల సైన్యముతో శత్రుసైన్యములోని కుటికి అడ్డుపడువారినందరిని తనఖడ్గమున కెఱజేసి ఔరంగజేబు శిబిరమును సమీపించెను. దారా ఆ వీరుని అప్రతిహతమగు శూరత్వమునుగాంచి సంతుష్టాంతరంగుడై విజయభేరుల మ్రోగింప నియమించి తనసైన్యముతో రుస్తుమును సమీపించెను. ఇంతలో దావూదుఖానుడు నొక శత్రుసైనికునిచే ఖండింపబడుటచే అతని సైన్యమంతయు చెల్లాచెదురై పోయెను. సిపైర్ షూకో తన్ను గాపాడువారులేనందున తనవెనుకనుండిన కొద్దిమందితో వెను దిరిగెను. దారా తనస్థానమువిడచిన అజ్ఞానమునకంటె మరి యొక్కటిలేదు. ఇప్పుడు తానుండిన మధ్యప్రదేశము సైన్య హీనమై, ఫిరంగుల గాపాడువారులేరైరి. గజములు, ఒంటెలు అతనికి సహాయము జేయలేనిస్థితిలో కడుదూరమందుండెను. తనసైన్యమంతయు తారుమారై తన అదుపుఆజ్ఞలలో లేనిదుస్థితి యందుండెను. అతడు తన జన్మవిరోధియగు ఔరంగజేబు సిబిరమునకుముందు సైన్యము పలుచనైయుండుటచే తన అదృష్టము పరీక్షింప అతనిపైబడనుంకించెను. అట్టి క్లిష్టసమయమున సత్రశాల మహారాజు రణనిహతుడయ్యెనని దారావిని తన సమర సంకల్పమును విడచి నిక్కువమును పరీక్షింప కుడిప్రక్కకు బరుగెత్తెను. సత్రిశాల మహారాజు మురాదుసైన్యముపైబడి

రాజపుత్రి వంశగౌరవప్రతిష్టలు నొక్కచోటనే మూర్తీభవించు నేమోయన్నచందమున సత్రిశాలుడు యెందుజూచిన తానై శత్రు సైన్యముల దునుమాడజొచ్చెను. ఆతని వెనువెంటబోరిన ప్రతి రాజపుతుడును శరీరమును తృణప్రాయముగ భావించియు ఆత్మ ను దైవాధీనముగావించియు హృదయమును విశ్వాసపాత్రము గావించియుఒక్కని ముషమైన రణరంగమున వృధాపోనీయక సమరముగావించుచుండ సత్రిశాలుని శిరము ఛేదింపబడి శివుని హారములో నొక్కటియైపోయెను. అతనివెంట రాతోతురాజగు రాజారామసింగు అనువీరుడు సహితము మరణించెను. సత్రి శాలునితో అతనికొమారుడు ముగ్గురు మరదులు మరణించి స్వామిఋణమును దీర్చుకొనిరి. రాజా రూపసింగు రాతోరు మురాదునకు సహాయము జేయవచ్చుచుండిన ఔరంగజేబుపై బడెను. దారా రూపసింగునకు సహాయముజేయ వెన్నంటెను. విశ్వాసఘాతకుడగు కలీలుదీసమయమున ఔరంగజేబు సైన్యము లతో తన 15,000 వేల సైన్యములగలపివేసెను. మాయల మారియగు ఔరంగజేబు ఒక్కతృటిలో యుద్ధభూమిలోని ప్రతి మారుమూలలోని నిజచరిత్రను గ్రహింపగలిగెను. అతడు తనకుమారుడగు మహమ్మదును అల్లకల్లోల తరంగములలో బొరలాడుచు, దిక్కుదెలియకున్న దారాసైన్యముపైబడ నాజ్ఞా పించెను. తనకున్న ఒక్కదిక్కగు రూపసింగు సహితము రణ నిహతుడయ్యెను. దారా కుతంత్రులమాటలువిని తనగజముపై నుండిదిగి ఒక అశ్వమధిరోహించెను. యువరాజు సైనికులు దారా యగుపడమి చెల్లాచెదరైరి. దారా యిప్పుడు తానుజేసిన

అపరాధమును కనుగొనినను వెనుదిరుగక యుద్ధము జేయు చుండెను. ఉన్నట్లుండి వేడిదుమ్ముతోగలసిన పెనుగాలి వీచి దారాకున్నకొద్దిసైన్యములకన్నులలోను, ముఖముపైనబడి చికాకు బరుప, సైన్యములోని ప్రతిమనుజుడును తమపెదవులపై తడి తగిలిన జాలునని తహతహలాడజొచ్చిరి. తనకుమారుడగు సిపైర్ షూకో యుద్ధభూమియందు బావురుమని యేడ్చుచుండెను. వీనినన్నియుజూచి దారా నిర్విణ్ణుడై విషాదహృదయముతో విలోకింపసాగెను. రాజభక్తి శిఖామణులుకొందరు దారాను దరిదాపులేనివానిగజేసి ఒంటరిగ విడువజాలక అతడధిష్ఠించి యున్న అశ్వపు కళ్ళెమునుబట్టుకొని ఆగ్రావైపునకు మరలిరి. స్వామిద్రోహియగు కలీలుల్లా తన పదునైదువేల సైన్యముతో ఔరంగజేబుతో జేరకున్న విజయలక్ష్మి యెవరివివరించియుండునో జెప్పనెవరితరము. ఈ సామగర్ యుద్ధచరిత్రయందు చాల ప్రాధాన్యమైనది. ఈ సమరము షాజహానుకుమారులలో కిరీటార్హుని దప్పించి మరియొక కుమారునికి వచ్చునట్లుజేసెను. ఆగ్రా అక్బరను పేరుగాంచిన దారాకాంతుడు సామగర్ సమరమున సమసిపోయెను. దారా యీయుద్ధమున ప్రశస్తమైనసైన్యమును పోగొట్టుకొనుటేగాక, యెట్టియాపదులందు సహితము నెందరినోరక్షించిన మనస్థైర్యమును సహితమతడు గోలిపోయెను.

దారా నావ యిప్పుడు తనరేవువిడచి అల్లకల్లోల సముద్రతరంగముల తాకుడులచే క్రిందుమీదగుచు నాయకుడులేనిదై శీఘ్రముగ నగాధ జలమున మునగి పేరు ఊరు లేకుండ ప్రపంచపు మరుపునకలవాలమగునట్లు దోచుచుండెను.

# యొనిమిదవ ప్రకరణము

# అదృష్టపు దాగుడు మూతలు



అదృష్టహీనుడగు దారా యుద్ధభూమినుండి పరుగిడియొక మహీరుచ్ఛాయ విశ్రమించి తనయుద్ధపు టుడుపుల దీసివేయుట కుపక్రమించు సమయమున గుండెలవియునట్లు శత్రువుల భేరీ మ్రోత వినబడెను. దారానిశ్చలుడై హృదయము, బొందు, విషాదము, కన్నీటి ప్రవాహమున దెలియుచుండ కటికనేలపై బరుండుకొనెను. తోడనున్న సైనికు లతనని ఆగ్రాజేర తొందర బరుపసాగిరి.

దారా మిగుల ఖిన్నుడై "విధివిధానము ననుసరించి జరుగవలసినదేను. ఇప్పుడే జరిగిపోనిమ్మని" నుడివిగూర్చుండెను. కాని ఆత్మీయుల బలవంతమువలన నెట్టులో ఆగ్రాజేరి జనకుని దర్శింపక తనసౌధముననే బరుండెను. మృతప్రాయుడైన దారా పాదుషా ముఖమును జూడలేనని జెప్పి పంపెను. షాజహాను తనకుమారునకుజరిగిన భయంకర విపరీతపరాభవము ను విని మిగుల వాపోయి పుత్రుని దర్శనమియ్యమిగుల దీనముగ వార్తలంపెను. పాదుషా ఆజ్ఞాను బద్ధుడై దారా భార్యయగు నదీరబేగముతోడను, బిడ్డలతోడను జనకుని సౌధమును జేరెను. ఆ కృష్ణహిమాచల పర్యంతము గడగడ లాడించిన వృద్ధచక్రవర్తిప్పుడు దాపులేని బాలునివలె తనయుని కౌగిలించు

కొని బిగ్గరగ యేడువఁజొచ్చెను. జనానా యంతయు హృదయ విదారకములగు రోదనములతో నిండిపోయెను. పాదుషా గడ గడ లాడుచున్న తన దీర్ఘపు చేతులతో దారానుస్పృశించి, "నాయనా ఇది కడసారి చూపులేమోగదా! ఇదిగో నా సర్వసంపదల కీసికొని కొ్రొత్తసైన్యములతో మరల యుద్ధ ప్రయత్నము గావింపు" మని వెలలేనిమణిమయభూషణములు, ధనరాసులనిచ్చి "త్వరితగతినిబొమ్ము; ప్రాణములుండిన మరల గలియవచ్చును. నాకీభాగ్యము కలుగునో కలుగదోగదా! సర్వసంపదలు రాజ్యము లుండియు రాజార్హుఁడగు నా ముద్దుల తనయుని రక్షించుకొనలేక బోయితిని. నేను నా తండ్రియెడ జేసినపాపమే నేడిట్లు ప్రత్యక్షమయ్యెను. మీతల్లి యీదుఃఖమును జూడలేకగాబోలు నన్నిచ్చటనే విడచి పరలోకవాసి యయ్యె"నని దుఃఖింపనచ్చటనున్న వారందరు కంటదడివెట్టిరి. దారా ఆగ్రా విడచిపోవుచున్నప్పుడు యువరాజు వంటి సన్మార్గశిఖామణియగు రాజకుమారునికి గలిగిన దుస్థితికి ఆగ్రాలోని ప్రతి ఇంటనేదో మరణము సంభవించినటుల నెత్తిగొట్టుకొని విలపించుచు రోదనధ్వనులు మిన్నుముట్ట ఆగ్రా యంతయు దుఃఖాబ్ధిలో మునిగిపోయెను.

దారా పండ్రెండు ఏనుగులపై ధనరాసులు మోయించుకొని కొద్దిభటులతోడను, తనభార్యాబిడ్డలతోడను ఢిల్లీ పట్టణము చేరెను. దారా ఢిల్లీ జేరునప్పటికి అతనితో 5000 సైన్యము

జేరుకొనెను. ఢిల్లీలోని సైనికసంపదలు దారా వశమగునట్లు చక్రివర్తి శాసించెను. దారా అతిత్వరితముగ సైన్యముల జేకూర్చుచు అలహాబాదు నందుండు తనతనయుడగు సులేమాను ను తన్ను గలియవలెనని వార్తనంపెను. దారా ఢిల్లీ జేరిన అయిదు దినములలోనే ఆగ్రి ఔరంగజేబు వశమైపోవుట దారా కొక నాశాఘాతమైపోయెను. దారాకిప్పుడు లాహోరునగల తన ప్రతినిధియగు ఇజత్‌ఖానువద్దకు బోవుటా లేక అలహాబాదులోని తన తనయుడగు సులేమానువద్దకు బోవుటా అను సమస్య యేర్ప డెను. కడకతడు లాహోరునకు బోవుటకే సంకల్పించెను. అతడట్లు లాహోరునకు పయనము సాగింపక అలహాబాదునందు గల తనయుని సమీపించి సింహాసనమునకు ఔరంగజేబుకన్న నెక్కుడు హక్కుగల షూజాను జేరియున్నచో ఇరుసైన్యము లొక్కటిగజేరి శత్రువునెదుర్కొను బలముగలదై యుండెడిది. అంతేగాదు మురాదిప్పుడు అన్నయగు ఔరంగజేబు తన్ను మోస గించినను, నిజస్వరూపమెరిగిన వాడగుటచే నతడును సమయము నకు వేచియుండెను. మరియు జస్వంతుడు రాజపుత్రిస్థానము నుండియు; పంజాబు కాబూలులనుండియు; బీజపూరుగోల కొండా ది ప్రిదేశములనుండియు; ఔరంగజేబుపైబడి శత్రువిచ్ఛేదమును గావింప గారణమైయుండును. వినాశకాలే విపరీతబుద్ధి యన్నట్లు, దారా లాహోరే శరణ్యశాలగా భావించెను. అందుచే ఔరంగ జేబునకు తనశత్రువుల నొక్కొక్కరిని ప్రత్యేకముగ మారణ

హోమమున దోయునదృష్టము లభించెను. సులేమానుషూకో యైనను హిమాలయా ప్రాంతమార్గమున తండ్రినిజేర సాహసింపక పినతండ్రిని సమీపించియున్నచో గొంతవరకైన సమంజసమై యుండెడిది.

అపార సంపత్తితో ఢిల్లీనుండి కదలిన దారా 10,000 సైన్యముతో లాహోరు నగరము జేరెను. దారియందు సట్లెజు నదీతీరమున దావూదుఖానును శత్రువుల దాటనీయకుండుటకై నియోగించి లాహోరుజేరినదే ఇజతుఖాను 5000 పౌజుదారులతో దావూదునకు సహాయమంపెను. కొలదికాలములో 20,000 సైన్యము జేరుటచే దారాకు మంచికాలము మరల మరలినట్లుండెను. జుమ్మూరాజైన రాజరూపుడు సహితము దారాకు తాను లెక్కకు మిక్కుటమగు కొండజాతుల సైన్యమును జేర్చునట్లు మాటఇచ్చెను. దారా, రాజపుత్రులపై ప్రబలతర విశ్వాసములు గలవాడగుటచే రూపసింగునకు విశేషధనమునిచ్చి సైన్యముల సమకూర్ప నియోగించెను. మహారాజ్ఞి నాదిరుబేగము సహిత్రము తన చనుబాలను రాజరూపునికిచ్చి పానమొనరింపమనెను. ఆ కాలపుటాచారమునననుసరించియే బేగముగారి చనుబాలను త్రాగినవారు నాటినుండి తనబిడ్డలయినట్లు దలపబడుచుండెను. అట్లగుటంబట్టియే రూపసింగు తమ్ము మోసముచేయక పుత్రవిశ్వాసముంచునని యెంచిన దారాబేగముగారట్లు జేసిరి. కాని అవిశ్వా

సహృదయులకెన్ని జేసినను తమ నీచత్వము మానరు అట్టివారి చరిత్రవలన దేశచరిత్రలు కళంకితా పూరితమగు కథలతో నిండి యుండవు. ఒక సంవత్సరములోపలనే రాజరూపుడు తల్లిపాలు గుడిచి పిపుగ్రుద్దెనన్న రీతి లక్షల ద్రవ్యమును దారావలన బొంది ఔరంగజేబునకు సహాయముజేసి దారా కపజయము గల్పించెను. ఐరోపియనులు దారాకు కడపటివరకు విశ్వాసపాత్రులై తమదేశ గౌరవమును చిరస్థాయిగ స్థాపింపగలిగిరి.

సాముగర్ యుద్ధమునుండి విడిపోయిన ఇటలీదేశస్థుడగు మనూకీయను యుద్ధవీరుడు దారావంటి సౌమ్య రాకుమారుని విడువలేక మారువేషమున అనేక కష్టములబడుచు లాహోరు జేరి దారాను దర్శించెను. ఆనాటికి మనూకీ దారాకేగాక తాను చూచినదంతయు వ్రాసి దేశచరిత్రకు సహితమెంతేని మహోప కారమొనర్చెను. దారా లాహోరునకు వచ్చిన ఒక మాసము నకు ఔరంగజేబు బహదూరుఖానును గొప్పసైన్యముతో సట్లెజు నదినిదాటి లాహోరును ముట్టడింపబంపెను. అతనికి తోడుగ స్వామిద్రోహియగు కలీగుడుగూడ వచ్చెను. బహదూరుఖాను దారాసైన్యముల కనుగప్పి సట్లెజునదిని మరియొకచోట దాటి లాహోరును సమీపించెను. శత్రుసైన్యములింత త్వరితముగ వచ్చునని దారా భావింపలేదు. సులేమానుషూకో తన్నువచ్చి గలియువరకు శత్రుబాధ వుండదని దలచెను. దయ్యమునకు

సముద్రమునకుమధ్య తానుండునట్లగపడెను. లాహోరునందుం డుటా లేక లాహోరుపట్టణమును విడచుటా యనుట సమస్య యైపోయెను. సహాయము జేయుదమనేవార్త యేమూలనుండి యు రాదయ్యె. విజయలక్ష్మిని పోగొట్టుకొన్న దారా తనకై యనేక ప్రాణులాహుతియై వారి భార్యాబిడ్డలేల శోకింపవలయునని దలచెను. అట్టియుదార హృదయమూర్తికే ఇట్టి అపజయము కలుగుట ప్రకృతియొక్క విపరీత చేష్టితముగాక మరేమనవచ్చు ను! విశ్వాసపాత్రుడగు దావూదుఖాను లాహోరును విడచిపోవుట సమంజసము గాదనియు సిఫైర్‌షూక్‌ను సైన్యాధిపతిగావించి శత్రుసైన్యముల నెదుర్కొనుటే యుత్తమమని సలహానిచ్చెను. దారాకూడా అందులకు సమ్మతించెను. విధి యెదురుతిరిగి నప్పుడు అడుగడునకు అడ్డంకులేగదా! ధైర్యమును మాత్రము క్రమక్రమముగా గోలిపోవుచుండిన తనభర్తకు ప్రాపై ధైర్యము బోధించుచు సహధర్మచారిణియై కష్టములందు పాల్గొనుచు వీరవని తయై యొప్పారిన సాధ్వీమతల్లియగు నదీరాబేగమాసమయమున తన కనులముందుండొక్క కూమారుని రణభూమికిబంప సాహ సింపదయ్యె. ఆమెను సమ్మతింపజేయుటకు రెండుమూడుదినము లు బట్టెను. సిఫైర్‌షూకో యుద్ధభూమికి వెడలుటకాలస్య మైనందున దావూదుఖాను ఒంటరిగ అపారమగు శత్రుసైన్య ములనెదుర్కొనలేకపోయెను. ఔరంగజేబే స్వయముగా నచ్చట ప్రత్యక్షమయ్యెను. ఔరంగజేబు రాజా రూపసింగును సహితము

కలీలునకు సహాయముజేయబంపెను. తమ పూర్వ ప్రభువును నాశనమొనరింప యీ విశ్వాసఘాతకులిద్దరొకచోట గుమిగూడిరి దారా విషయముల గ్రహించి సిపైర్ షూకోను తన్ను గలిసికొనమని దెలిపి దావూదుఖానును చాలినంతవఱకు శత్రునిరోధనము గావించి కాల విలంబమొనరింపమని తాకీదు బంపెను. విరోధముల సృష్టించుటయందగ్రతాంబూలము ఔరంగజేబుదే; దావూదుఖానుని విశ్వాసదృష్టిజూచి నివ్వెరపడి దావూదుఖాను దారాను బట్టిఇచ్చెదనని వ్రాసినట్లును ఆ జాబును తానుజూచి మిగుల సంతసించి అతనిని తన సర్దారులలో నొక్కనిగజేసికొనినట్లు నొకలేఖనువ్రాసి వార్తావాహుల చేతికిచ్చి దావూదుఖానుని వద్దకు బోవునట్లు నటించుచు దారాసైనికులకు దొరకునట్లు వారికి జెప్పి పంపెను. వారును ఔరంగజేబు నాజ్ఞననుసరించి దారా శిబిరముచెంత దిరుగుచు వారికనుమానము గల్పింపజేసిరి. దారా సైనికులు వారినిబట్టి దారా యెదుట నిలువబెట్టిరి. దారా వారిని బుజ్జగించి వారి నిజవృత్తాంతమడుగ ఆ వార్తావాహకులు మిగుల భయపడినవారివలె నటించి తమదట్టీయందు దాచియుంచిన వుత్తరముల యువరాజునకందజేసిరి. ఆ కమ్మను దిలకించినవెంటనే దారా కనులశ్రుపూరితములయ్యెను. తుదకు దావూదు కూడా ఇంత యవిశ్వాసమైపోయెనాయని జింతించి ఔరంగజేబు భటుల దండింపకయే బంపివైచెను. వారు ఔరంగజేబువద్దకు వచ్చి

జరిగినదంతయు విజ్ఞాపింప నతడు తానువేసిన విత్తులు మొలకెత్తి బ్రహ్మాండమగు వృక్షముగాక పోదని దలచి మిగుల సంత సించెను.

దావూదుఖాను డబీయాన్ నదీతీరమున కలీలు రాజాజయ సింగులను, తనశక్తికొలది నిరోధించి ఇక వీలులేదని అచ్చట విడచి పలాయనమగుచున్న తనస్వామినిగలసికొనెను. దారా ఔరంగజేబిడిన కృత్రిమ సన్నిహితంబుగు సురాపాన మొనరించి మత్తెక్కిన వాడగుటచే దావూదుఖానుని విశ్వసింపక అతనిని తన్ను పరిత్యజింపమని జెప్పెను. దావూదుఖానుడు యువ రాజట్లు బలుకుటవిని మిగుల చింతాక్రాంతుడై నిజమెరింగి తన గుడారముననుండిన భార్యబిడ్డల కనికరములేక ఖండించి దారా మ్రోలమోకరించి ఔరంగజేబు జేసిన మాయాజాలమునకు జిక్కు కొనక తన సేవ నంగీకరింపవలయుననియు, తన భార్యా బిడ్డల పైగల తీపిచే ఔరంగజేబును జేరనుద్యమింతునను దురూహ బాపుటకే వారినందరిని సంహరించితిననియు దీనాతి దీనముగ బ్రతిమాలి కన్నీటిచే దారా పాదముల గడిగివైచెను. అట్టి విశ్వాసపాత్రుడగు దావూదువంటి వారే ఈ లోకమున మరి నలుగురున్నచో నీభూతలము స్వర్గలోకమైపోయి యుండునుగదా! పొట్టవిచ్చి చూసిన గారడివిద్యన్నట్లు దారా దావూదుఖానుని విశ్వ సింపడయ్యెను. అందువలన నికచేయునదిలేక తనమాతృస్థాన

మగు హిస్సారునకు అతడువెళ్ళి మిగిలిన తన జీవితకాలమంత యు నందేగడపివై చెను. దావూదుఖానుని సుగుణమునకుహర్షించి క్రూరుడగు ఔరంగజేబు సహితము అతనికి కిల్లతునుగూడ బంపెనని యొక ప్రతీతిగలదు.

దారా లాహోరునుండి దీసికొనిపోవుచుండిన ధనసంచయముచే నాకర్షింపబడి 14000 వేలమంది సైనికులు దారా ననుగమించి ముల్తాను పట్టణమువరకుపోయి అచ్చటినుండి ముందునకు బోవ సాహసింపక 7000 వేలమంది వెనుకకు మరలిరి. మిగిలిన సైన్యము చావుతప్పి కన్నులొట్టబోయినదన్నట్లు ప్రయాణ ప్రయాసతో సగముజచ్చి బక్కరుకోటను జేరిరి. అచ్చట దారా అయిదు దినములు విశ్రాంతి తీసికొని తన జనానా స్త్రీలను, విశేష ధనసంచయమును, అపార యుద్ధసామగ్రిలను వసంతుడను కొజ్జాయధనమందుంచి సుక్కూరునకు వచ్చెను. ఔరంగజేబు ముల్తాను వరకు అన్నను దరుముకొనివచ్చి షూజా అపార సైన్యములతో ఆగ్రాపై వచ్చుచున్నాడనివిని దద్దరిల్లి షేక్మీరు సఫ్షిఖానను యిరువురు సర్దారుల దారాను వెంటనియోగించి తాను ఆగ్రాకు వెడలిపోయెను.

దారా సుక్కూరువద్దచేరి పర్షియా చక్రవర్తియగు షాఅబ్బాసును ఆశ్రయించుటా ఆగ్రాపై మరల దండయాత్ర వెడ

ఐటాఅని యోచించి పర్షియాచక్రవర్తికి సహాయము జేయజెప్పి పంపగా నతడు బక్కారులో యువరాజుసంపదలు తన యధీనము చేసినయెడల యోచింతునని బదులుపంపెను. దారా దౌర్భాగ్యమే మనవచ్చునో తెలియకున్నది. తానుమరల సైన్యసమేతుడై ఆగ్రాను ముట్టడింప బోయియుండినచో షూజా దారాలమధ్య ఔరంగజేబుసైన్యము నశించిపోయియుండును. దైవచిత్రమేమో గాని దారాకట్టి యవకాశమును వృథాబోనీయకుండుటకై ప్రయత్నింపక సింధూనదిమార్గముగ కచ్ఛీద్వీపమునుజేరెను. సప్షీఖాను, షేక్‌మీరులిరువురు దారాను కొంతదూరమువరకు వెన్నాడి షూజాపై దాడివెడలుటకు ఔరంగజేబును బిలువవారు దారానువిడచి ఆగ్రానుజేరిరి. దారా కచ్ఛిమహారాజును గలసికొన నతడు దారాను మిగులగౌరవించి తనకుమార్తెను సిప్పైరుషూకోకునిచ్చి వివాహము గావించెను. దారాకుమరల మంచిదినములు రానున్నవా! యనునట్లు దోచెను. దారా షూకోకచ్ఛియందు ఆదరణగొని కతేవారు రాజును దర్శించెను. ఆతడును దారానుచాల గౌరవించెను. మురాదు పాలించుచుండిన భాగ్యసంపన్నమైన గుజరాతు రాజులేనిరాజ్యమైయుండెను. తమపరిభువగుమురాదును ఔరంగజేబు మోసగించి బంపినందువలన మురాదు క్రిందిఉద్యోగులు ఔరంగజేబు పైగినిసియుండిరి ఔరంగజేబు గుజరాతునేలుటకు షానరాజుఖానుని బంపియుండెను. దారా 3000 వేల సైన్యముతో అహమదాబాదును సమీపింపగా షానరాజుఖాను మిగులప్రీతితో దారాను ఆహ్వానిం

చెను. ఆనాడు మొదలు దారా గుజరాతుప్రభువయ్యెను, ప్రతిదినము దారా ప్రజలకు దర్శనమిచ్చుచుండెనేగాని బ్రతికియున్న జనకుని గౌరవార్థమై తానుపాదుషాయని పేరుబెట్టుకొన సాహసింపలేదు కొలదికాలములో దారా ధర్మబుద్ధి 22,000 సైనికుల నాకర్షిం చెను. దారా సూరత్తునకొకచిన్న సైన్యముబంపగానది యవలీలగా వారివశమై అపారమగుధనము, యుద్ధపరికరములు దొరికెను. దారాసహాయపడకయుండినచో గోల్కొండ, బీజపూరునగరములు నేలమట్టమై యుండెడిదనుటకు మాచదువరులిదివరకే గ్రహించి యుందురు. వారినిప్పుడు సహాయమపేక్షింప దారాదలచి దక్షిణ దేశ దండయాత్రజేయ సంకల్పించెను. గాని దారా దుర్దినముల సంతమైనప్పుడు అట్టిమార్గమునకు అడ్డంకులే లేకుండునా! అట్టి ప్రయత్నముననున్నప్పుడు ఔరంగజేబు షూజాచే ఓడిపోయి నట్లును: జస్వంతుడు అశేషమగు ధనసంచయమును; ఔరంగజేబు కొల్లగొట్టి దెచ్చినట్లును, ఒక విపరీతప్రచారము వ్యాపించెను. అమాయకుడగు దారా ఈప్రచారమునునమ్మి దక్షిణదేశమునకు బయలుదేరక ఆజమీరునకు పయినమయ్యెను. అతడు రెండుమజ లీలు వేయునప్పటికి; ఔరంగజేబు షూజానుదరిమివైచి సంపూర్ణ విజయమందెననియు తానువినినది గాలివార్తయేగాని వాస్తవము గాదనియు దెలియవచ్చెను. మహారాజు జస్వనుడు ఔరంగజేబుపై దాడివెడల సన్నద్ధుడగునట్లు దెలియవచ్చుటచే దారా జస్వంత మహారాజును దర్శింప జోద్పుర పరిసరప్రదేశమునకు వెడలెను.

కాని జస్వంతుడు తన్నాహ్వానించుటకు వచ్చునట్టి చిహ్నముగాని తానువినిన యుద్ధసన్నాహపు యేర్పాటులుగాని గోచరముకాదయ్యె. జస్వంతుని తనరాకనుగూర్చి జెప్పిబంప అతడుదారాను ఆజ్మీరు జేరమనియు తానుసర్వచిహ్నముజేసిన యనంతరము తనతోజేరె దననిజెప్పి బంపెను. ఇకజేయునదిలేక దారా ఆజ్మీరుజేరెను. రాజపుత్రులకు తలమానికమువంటివాడగు మహారాణాకు సహా యమర్థించి యీవిధముగ వ్రాసిబంపెను.

మహారాణా రాజసింగు మహారాజులుంగార్కి శరణార్థి యగుయువరాజుదారా వినయపూర్వకమునర్థించునదేమన:—

సూర్యకులవంశ ప్రదీపులగు మీరు రాజపుత్రవంశభాస్క రులవంటినారు. న్యాయాన్యాయ విచక్షణా పరిశీలనకు మీయది అగ్రతాంబూలము, చక్రవర్తి మీపై ఆగ్రహించి చిత్తూరును నేల మట్టము గావింపదలచినప్పుడు నేనట్టియనుచితము గానీయక సాయమొనరించినవిషయము మీబోటి ఉచితజ్ఞులకు జ్ఞాపకముండ కపోదు. శరణార్థులగా పాదయసువుల, భోగభాగ్యముల, తృణప్రా యముగనెంచిన మీ యశోచంద్రికలగూర్చి స్వర్ణాక్షరములతో దేశచరిత్రలందు లిఖింపబడుటయేగాక మీవీరగాథగీతములు ప్రతి గ్రామమున దేశములుప్పొంగ గానమొనరింపబడుట సత్యేతరము గాదు, అట్టిమీయెడకు శరణార్థమైవచ్చిన ఒక చక్రవర్తికుమారుని

రక్షణమొసంగక పోరను ధైర్యము మమ్మ బరిగొల్పమీయండ జేరితిమి. మాకీసమయమున యభయహస్తమిచ్చిగాపాడి మీకీర్తి కింకను వన్నెదేగలరని విశ్వసించుచుంటిమి.

15 జనవరి 1659 ఇట్లు,

ఆ జ్మీ రు. శరణార్థియగుదారా.

హృదయ విదారకమగునీలేఖ మహారాణా రాజసింగు మనస్సునుకరిగింపదయ్యె. అతడెట్టిప్రత్యుత్తరము దారాకుబంప లేదు. మహారాణా షాజహానుతో దలపడి కొన్నిపరగణాల బోగొట్టుకొనియుండెను. అనాడు దారాప్రయత్నమువలన రాణాగారి ప్రధాననగరము నాశనముగావింపబడక విడచిపెట్టబడెనేగాని చక్రవర్తి ఆక్రమించినప్రదేశములు ఔరంగజేబుమిత్రుడును, చక్రవర్తి సేనాధిపతియగు సాదుల్లాఖాను వత్తడివలన రాణాకు ఒప్పగింపబడలేదు. వానిని మరలసాధించు పలవరింపుదప్ప రాణాకు తదితర కీర్తిప్రతిష్టలయందు మాధుర్యమగుపడదయ్యె. అందువలన నాతడు ఔరంగజేబునాశ్రయించెను. చతురుడగు ఔరంగజేబు రాణాను తనవైపునకు ద్రిప్పుకొనుటకై దక్కనునుండి దండయాత్రవెడలునపుడు రాణాకుజేరవలసిన నాలుగుపరగణాలు అతనికిచేరునట్లు జేయుదునని వ్రాసిపంపెను. తాను దార్మత్‌యుద్ధ

మునవిజయుఁడైనచో రెండవతూరిరాణాకు తనకుచేరవలసిన రాష్ట్రములఁ దానేఆక్రమింపవచ్చుననియు, భగవంతుని దయయున్నచో నతనినింకను గొప్పరాష్ట్రములకధిపతి జేయుదుననియు వ్రాసెను. సాముగర్ యుద్ధానంతరము మహారాణాకు, ధనగర్‌పూరు. వంశవారా, వంశావరునగరములనిచ్చి అతనిని తనవైపునకుదిప్పుకొని యుండెను. ఔరంగజేబునకుగల మతద్వేషముదెలిసిన హిందువులను తాను స్థిరపడువరకు నిశ్శబ్దముగనుంచుటకొరకే ఇట్టివన్నాగ మునుబన్నెను. ఔరంగజేబొసగిన ఆశామధుపానమత్తుడైన రాణా నిజమెరుంగక దారా సాయముజేయననుట వెఱ్ఱిదనముగాక మరేమనగలము.

రాణా తోడ్పడునను నాశ నిరాశయైనప్పుడు దారా జసవంత మహారాజునొద్దకు రూబిన్‌చందును రాయబారిగా బంపెనుగాని అతఁడతనిటు గానటులజెప్పి బంపెను. అంతటితోనూరుకొనక తన కుమారుఁడగు సిపైరుషూకోనుసహితము మిగుల కనికరము గలుగునట్లు ప్రార్థింపజేసెనుగాని దారాను ప్రాణసమానముగ జూచుచుండిన జస్వంతుడతనితో జతపడుట కియ్యకొనడయ్యె. జస్వంతుడిట్లేలయొనరించుచుండెనో యోచింతము. కజ్వా యుద్ధమున ఔరంగజేబు షూజాను ఓడించినసమయమున జస్వంతుడు సహితము యుద్ధమునకు వెడలియుండెను. అందువలనగలిగిన ఔరంగజేబు కోపాగ్నిని జల్లార్చుటకై దారాను తనసమీపరాజ్య

మునజేర్చుకొని, నాతని యుద్ధసన్నద్ధునిగానీయక కాలాహరణము జేయించుచుండెను. జస్వంతుడు మొట్టమొదట దారాను తనవద్దకు రమ్మని బిలచినప్పుడు నిజముగ జస్వంతుడు యుద్ధప్రయత్నములు జేయుచుండి యే యువరాజును బిలచియుండెను. కాని ఇంతలో ఔరంగజేబుసైన్యములు తనపై పగసాధింప వచ్చుచున్నవని విని భయమునొందుచుండ గోరుచుట్టుపై రోకలిపోటన్నట్లు పిడుగువంటి వుత్తరమొకటి రాజా జయసింగువద్దనుండి జస్వంతునికివచ్చెను. ఆ వుత్తరమునందిట్లుండెను.

"మహారాజ జస్వంతసింగుగారికి తమ శ్రేయోభిలాషి మహారాజ జయసింగు వ్రాయులేఖ విధానమెట్టిదన, దరిదాపులేక నశించుపోవుచున్న దారాకునీవు చేయుసహాయమెట్టిది? అట్లుచేయబూనుట నీకును, నీకుటుంబమునకును వినాశము దెచ్చునేగాని నిర్భాగ్యుడగు దారాకెట్టి శుభమొనగూర్పలేవు. అందువలన నీవు ఔరంగజేబుచే క్షమింపబడవు. నేనును నీవంటి రాజమాత్రుడనగుటచే రాజపుత్రరక్తము నిష్కారణముగ భూమిపైబడుటకిచ్చపొడముటలేదు. ఇతర రాజపుత్రరాజులు నీతోజేరుదురను నమ్మకముమాత్రము వదలిపెట్టుము. అదివట్టి భ్రమోపేతమేయగును. అట్టి నీప్రయత్నము నిరోధించుటకు చాలినంత అవకాశము లేకపోలేదు. రాజపుత్ర రక్తస్రావనిరోధము గావించుటకు ప్రతి రాజపుత్ర రాజునకు గలుగదు గావున నిన్ను రాజపుత్రస్థాన

మంతయు పీనుగులుపెంటజేయు యుద్యమమునకు దోహదము జేయనంగీకరింపరు. అట్లుగాక నీవుదారాను అతనిఅదృష్టా దురదృష్టములకే విడచినచో నౌరంగజేబు గత శతృత్వమంతయు మరచి పోగలడు. కజ్వా యుద్ధభూమినుండి నీవుదెచ్చిన యపారధనమును మరల జెల్లింపవలయుననిగోరడు. అంతేగాదు నిన్ను గుజరాతునకు ప్రభువునుగూడ జేయును. అందువలన నీవు కలలోనైనను వదలువని అయాచితముగ లభించిన పదవినిగొని నెమ్మదిగ నుండనగును. పైకనిన నియమములన్నియు తు. చ. తప్పకుండ నెరవేరుటకై నేనుత్తరవాదిగ నుందును.

ఇట్లు,

నీ శ్రేయోభిలాషి

జ య సిం గు.

అనుకొనని లాభములు రక్తపాతములు లేకనే లభింపనున్నప్పుడు వలదన్నను లక్ష్మిరానున్నపుడు మోకాలడ్డువారెవరుందురు. జస్వంతుడు ధర్మాభిలాషియైనను ఔరంగజేబుయొక్కయు, పారసీకసైన్య భతికిని జయసింగుజూపిన ఆశకును, మధ్య నిలచి పోయి దారాకు సహాయముజేయ ముందుకురాకపోయెను. గాని

మానవంతుడగు జస్వంతుడు ఆశకుడాసుడై కొద్దికాలము మాత్ర మే యుండగలిగెను. జస్వంతుడు తన ప్రలోభనిద్రనుండి లేచు నప్పటికంతయు జారిపోయియుండెను. దారా అప్పటికి యీపాపపు లోకమున నికనుండుట నింద్యమని యస్తంగతుడై పోయి యుండెను.

రాణా జస్వంతుసింగులచే జారవిడువబడిన దారా యిక చేయునదిలేక కడపటిప్రయత్నముగ యుద్ధసన్నద్ధుడయ్యెను. తన కుటుంబమును ఆజ్మీరునందుంచి కొద్దిపాటిసైన్యముతో దియో రాయి కొండ కనుమలుజేరి సైయ్యదుల కొక్కొక్క సైన్యమిచ్చి పర్వతములందు కందకములలోనిలచి యుద్ధసన్నద్ధులైరి. ఔరంగ జేబు స్వయముగ సైన్యములతోవచ్చి దారా సైన్యములదాకెను. ఇరుసైన్యములకు తీవ్రముగ యుద్ధము ప్రారంభమయ్యెను. దారా అర్ధాంగియగు నదీరాబేగముగారి పాలను త్రావి పుత్రుడునని శప థముగావించి లక్షలరూప్యముల చూరగొనిన రాజపుడే దారా యుద్ధవ్యూహమును బగులగొట్టెదనని ఔరంగజేబువద్ద శపథము గావించి పర్వతారోహణ సామర్థ్యపరులగు వేయిమందితో పర్వ తములనెక్కి శత్రుసైన్యములకు మార్గముగల్పించెను. ద్రోహత్వ మున నతని తమ్మునివంటివాడగు రాజా జయసింగు ఫిరంగులతో దారాను సమీపించి ఫిరంగులు ప్రేల్చెదము; దారాను తప్పుకొమ్ము మని వార్తనంపెను. దారా యీవార్తవిని నిజముగ విభ్రాంతుడై

యెడమపై పుననుండి తొలగిపోయెను. జయసింగు యొనర్చిన మోసమువలన దారా సైన్యములు ఓడిపోవుటకు కారణమయ్యెను. పాపము వృద్ధుడగు షానవాజుఖానుడు ఫిరంగి ప్రేలుడులోగలసి స్వామికార్యములకై ప్రాణములర్పించి స్వర్గమున విశ్వాసపాత్రులు పొందు వుచితస్థానముబొందెను. సైనికులు కడపటిప్రయత్నముగ దారాకొరకై హోరాహోరిగపోరి 5000 వేల శత్రుసైన్యములను దునుమాడ్చి కృతార్థులైరి. దారా కచ్చికి బోవునపుడు అతనిని బట్టుటకై వెన్నాడిన అవిశ్వాసపాత్రులగు షేక్‌మీర్ మరణించె. దిలీరుఖానుడు గాయముబొంది జీవన్మృతుడయ్యెను. దారా యీ యుద్ధమున మొగల్‌బిడ్డడై రాజకుమారుడను పేరు నిలువబెట్టుటకై దినమంతయు మిగుల వుద్రేకపూరితముగ బోరెను. గాని లెక్కకుమించిన శత్రుసైన్యమందు ప్రయోజనము లేకపోయెను. ఇక యుద్ధమాడినను ప్రాణాహుతిదప్ప నన్యలాభముండదని గ్రహించి తనకుమారుడగు సిపైర్‌షూకో, మక్‌బల్, ఫిరోజ్ అను సర్దారులతోడ జననా సమేతుడగు గుజరాతు దిక్కుగ ప్రాణరక్షణార్థమై పయనము సాగించెను.

## తొమ్మిదవ ప్రకరణము
## దారా—నాటకాంతము

హంస తూలికాతల్పంబున బవ్వళించి, సేవకాబృందము అడుగులకు మడుగులొత్తుచుండ, నోరుగదల్పక, పెదవి విప్పక,

కనుసన్నలతో సమస్తకార్యములు నెరవేర్చుకొనుచుండిన మహా చక్రవర్తికోడలు నదీరాబేగము తననాధునితో యెడారిమయప్రదేశమున ప్రాణ మరచేతబట్టుకొని బరుగిడవలసివచ్చె. నీరున్నప్పుడు మండూకములకు గొదువలేనట్లు, సంపదలున్నప్పుడు దారాకు సేవకాబృందమునకు గొదువలేకుండెను. సంపదసన్నగిలి కష్టములు సంప్రాప్తింప 20,000 సైన్యము మాయమై 2000 మంది మాత్రమే మిగిలిరి. దినమునకు ముప్పదిమైళ్ళవంతున పయనము సాగించుచు విశ్వాసపాత్రుడగు ఫిరోజుతో గుజరాతువైపునకు మరలెను. జయసింగు, జస్వంతసింహులిద్దరు 20,000 సైన్యముతో దారాను వెన్నాడజొచ్చిరి. జస్వంతుడుమాత్రము జయసింగుతో దారాను దరుముకొనిపోయిన అపరాదమునకు, జీవితమంతయు పశ్చాత్తాప తప్త హృదయుండై ఔరంగజేబును యేవగించుకొనుచు, అతనిని తుదముట్టింప ననేకపర్యాయములు బ్రయత్నించెను. కాని యది కేవలము గత జలసేతుబంధనమైపోయెను. దారానుగాని అతని కళేబరమునుగాని మరలిరావలదని ఔరంగజేబు జయసింగునకు కఠినపు ఉత్తరవులనుబంపెను. దారా కెవరును శరణాగతభిక్ష మియ్యగూడదనియు, అట్లు దారా నాదరించినవారు ఔరంగజేబు పాదుషా యాగ్రహమునకుపాత్రులై సర్వనాశనమునకు గురియగుదురని జయసింగు ఫర్మానాలువ్రాయించి బరుగిడుచున్న దారా గమ్యస్థానము జేరకమున్నె రాజులకు జమీందారలకు జేరునట్లుబంపెను. విద్రోహియగు జయసింగు దారాను

దరుముటకు జూపుచున్నకౌశలములో నూరింటొక పాలయినను షూజాను వెన్నాడుటయందు జూపియున్నచో మొగల్ రాజ్యచరిత్ర వేరువిధముగ వ్రాయబడియుండెడిది.

దారా నమ్మకమగు నల్పసంఖ్యాకులగు భటులతో నాకలి దప్పులతో మిగుల కృశించి ప్రయాణముజేయుచు, కోలీ దొంగల మూకలు తమపై బడుదురను భయాతిరేకముచే నిదురెరుంగక అహమదాబాదునకు 48 మైళ్ళ దూరముననిలచి తనఉద్యోగస్థు నొక్కని అహమదాబాదునకు ముందుగాబంప అప్పటి కప్పుడే దారాచే నియోగింపబడిన గవర్నరును బంధించి కారాగార ప్రవేశ మొనరింపజేసిరనియు, అచ్చటికిబోవుట ప్రాణములకు ముప్పనియు, దెలియవచ్చెను. జయసింగుబంపిన పర్మానాలవలన దారాకు తలదాచుకొనుటకు జానెడుస్థలమైనను దొరకలేదు.

బెర్నియరను ఆంగ్లవైద్యు డకస్మాత్తుగ దారియందు దారాకు దారసిల్లెను. దారా రెండవపత్నియగు రాణాదిల్ నకు కాలి యందు గాయము దగిలియుండుటచే, బెర్నియరును వైద్య సహాయమునకై తనవద్దనుండ మిగులప్రార్థించుటచే విధిలేక బెర్నియరు అతనితో మూడుదినములుండెను. దారా నొకగుడారమును గూడ నోచుకొనడయ్యె. పరదాగుడ్డలే స్త్రీ జనంబుల మరుగుపరుచుట కుపయోగింపబడుచుండెను కోలీసులను దొంగలమూక తమపైబడి

తమ్ము హతమార్చెదరను వదంతి ప్రబలుటచే దిక్కులేని దారా మిగుల భయభ్రాంతుడై బెర్నియరను ఆరాత్రి అంతయు జనానా బవ్వళించు ప్రదేశమున తెరగుడ్డలగప్పి, రహస్యముగ దాచి యుంచెను. మరునాటి యుదయమున దారా జనానాలోని, స్త్రీల ఆక్రందనధ్వనులు హృదయ విదారకమై ప్రతికంటకన్నీరు ద్రవిం పజేసెను. దారా కెచ్చటికి బోవుటాయను గొప్పసమస్య యేర్ప డెను. దారా పడమటిదిక్కునకు కోలీనాయకుని ఆశ్రయింప వెళ్ళెను. ఆనాయకుడు దారాదురవస్థనుజూచి మిగుల వగజెందెను. తస్కరనాయుకుడని పేరొంది, ప్రయాణికుల హృదయముల దద్దరిల్లజేయు కోలీనాయకుని హృదయము, చక్రవర్తిగావలసిన రాకుమారుని దీనావస్థజూచి ద్రవించిపోయెను. కఠిన శిలాకర్కశ హృదయమునుండి ద్రవించిన వీరు రాజులని, శరణాగతరక్షణా బిరుదాంకితులని, పేరుబెట్టుకొనిన జయసింగువంటి కర్కసహృ దయములందు కాగడావెలుతురున వెదకినను కించన్మాత్రమైనను కరుణారస మగుపడలేదు. గోముఖ వ్యాఘ్రమున నిమిడియున్న క్రూరత్వము, నిక్కవమగు వ్యాఘ్రమునందుండదనుట సత్యేతర ముగాదు. కోలీనాయుకు దారా జనంబులజాల నాదరించి కచ్చి ప్రాంతమువరకు తోడిచ్చి బంపెను. ఇంతలో దారా బాల్యమిత్రు డగు, గుల్‌మహమ్మదుఖాను యాభైమంది అశ్వదళముతోడను, రెండువందల పదాతులతోడనువచ్చి దారాను గలసికొనెను. దారా కచ్చిమహారాజు యింతకుపూర్వము తనకుజరిపిన మర్యా

దలే జేయునని ఆశించియుండెను. జయసింగుబంపిన లేఖాఫలిత ముగ కచ్ఛిమహారాజు దారాకు ఆశ్రయమిచ్చుటకు భయపడి, రెండుదినములు మాత్రము ఆశ్రయమిచ్చి, తనదేశపు భయంక రపు టుప్పుపట్టులమార్గముగ మరల సింధుదేశమునకు బంపెను. ద్రోహియగు కలీలుల్లాఖానుడు, దారా తన సర్వసంపదలించి యుం డిన బక్కరుకోటను ముట్టడింప, నాకోటను గాపాడుచుండిన వసంతు, వసంతుదేఅయి మిగులధైర్యసాహసములతో బక్కరును గాపాడుచుండెను. జయసింగు దినమునకు యెనుబదిమైళ్లవంతున రాత్రులందు కాగడావెలిగించి పయనముసాగించుచు దారాను సమీపించుచుండెను.

దారాకిక కాందహారు మార్గమున పారశీకమునకు బోవుట దప్ప వేరువిధానము లేనందున, అతడు బెలూచిస్థానమును జేరెను. అచ్చట చాంది అను జాతివారు దారా సైనికులపైబడి దోచుకొన సాహసింప, చాందిజాతికి విరోధులైన మగసిజాతివారు వారిని దరిమివైచి, దారాను కాందహారునకు సురక్షితముగ జేర్చుటకు సమ్మతించిరి. ఇంతవరకు వెన్నంటి తనస్వామిని రక్షింపుచు వచ్చిన ఫిరోజు దారావద్ద శెలవుపొంది గృహోన్ముఖుడయ్యెను. మిత్రుడగు గులామ్ మహమ్మదు మాత్రమింకను యువరాజును విడువడయ్యె, సర్వేశ్వరునికి దారా రక్షణాసంకల్పము లేనప్పుడు మానవ మగటి యెంతమాత్రము మాననీయమగును. కాంధహారు

ప్రయాణమునుగూర్చి దలచినవెంటనే నదీరాబేగమ్‌గారు, తదితర అంతఃపురస్త్రీలు బెలూచిల యధీనమున ప్రయాణమాచరించుటకు మిగుల భయ విహ్వాలులైపోయిరి. వారి గౌరవ మర్యాదలు కలారులగు నవిశ్వాసపు బెలుచ్చీల చేతిలో మట్టిపాలైపోవునని జడసిపోయిరి. అంతేగాదు పారశీక చక్రవర్తియగు షా అంతఃపురమున జొచ్చుట, సింహగహ్వారమున జొచ్చుటేయగునని భావించిరి. దారా స్త్రీలయలజడిబరికించుయు, తన సర్వస్వమగు నదీరాబేగము అతిసారబేధులతో బాధజెందుట జూచియు, తన కాందహారు ప్రయాణమాపుజేసి ఆస్థానమున యే సర్దారు సహాయమునసైన సైన్యము సమకూర్చుకొని మరల మయూరసింహాసనమునకై బ్రయత్నింప సమకట్టెను. మరణము రానున్నప్పుడు మృత్యుముఖమునకు మానవుడు తానై వలచిపోవునన్నట్లు దారాకు తలవనితలంపుగ ఒక మానవ రాక్షసాధముడును దాదరు జమీందారునగు మాతిక్ జీవన్ అను వానినిగూర్చి తలంపునకువచ్చెను. మాతిక్ జీవన్ చక్రవర్తికి విరుద్ధముగ ప్రవర్తించినందున ముల్తాను గవర్నరు తనిని బంధించి పాదుషా షాజహాను వద్దకు బంపెను. షాజహాను కుపితుడై మాతిక్ జీవన్ మత్తగజ పదహతులచే మరణింపజేయు నాజ్ఞల నొసగెను. దారా వద్ద నుద్యోగమందుండిన మాతిక్ జీవన్ మిత్రుడొకడు దారా సంతోషముగనున్న సమయముజూచి మాతిక్ జీవనుని విడిపింపమని కన్నీరు మున్నీరుగ నేడ్చి ప్రార్థించెను. కరుణార్ద్రి హృద

యుడు, ప్రాణదాతయగు దారా, మాతిక్, తనకొకప్పుడు ప్రాణాంతకుడగునని దలవక, చక్రవర్తితో మనవిజేసి అతనిని మరణదండనమాపుజేయించి గజారోహణాది సమస్త గౌరవములతో మాతిక్ జీవనుని మరల దాదరునకు బంపెను. ఆ విశ్వాసమింకను మాతిక్ జీవనుడు మనుసునందుంచుకొని యుండునని భావించి అతనికి జెప్పిబంపి మగసినాయకుడగు మీర్జాను విడచి దాదర్ నగరమును జేరబోయెను. సమస్తసంపదలు బాసినను, రాజ్యలక్ష్మి క్రీగంటనైన జూడకున్నను, గజతురగ పదాతి సైన్యములు తన్ను విడచినను, క్షుత్పిపాసాధి యిడుములబడి అలమటించుచున్నను తన అర్ధాంగియగు నదీరాబేగమొక్కతె తన యండనుండి క్రుంగిపోవుచున్న ఆశలు నిరాశలుగానియట్లు ఉత్సాహమూర్తియై, నిరంతరము ప్రబోధించుచుండ, దారా ప్రత్యేకమగు స్వర్గముతో తనకిక పనిలేని యటులే భావించియుండెను. మహాసాధ్వీమతల్లియగు నదీరా రానున్న యిడుముల దెలసి వానిని జూడలేక కాబోలు మార్గాయాశముచేతను, అతిసారబేదులెక్కువగుటచేతను, దారా దాదర్ జేరుటకు బూర్వమే మరణించెను. దారాకు తనభార్యా వియోగ దుఃఖము వర్ణింప నలవిగాకబోయెను. మహీమండలమంతయు అతనికి కటిక చీకటి కొట్టైపోయెను. అతని హృదయము విచలితమైపోయెను. సమస్తమంతటితో సమాప్తియైనటుల దోచెను, తనకు భార్యయై, మంత్రియై, శిష్యురాలై, ఆనందసముద్రమై, యొప్పారిన తన

అర్ధాంగిని సర్వేశ్వరుడు తనకు లేకుండ జేసినందులకు తన సర్వస్వమూ అనంతమూర్తి హరించినట్లాతనికి దోచెను. ఇక రానున్న యాపదలే దారా యెరుంగ గలిగియున్నచో, నవకుసుమ కోమల రాజ్యలక్ష్మియగు తన సతిని ఆ కడగండ్ల జూడక మున్నే దప్పించిన యాభగవానునికి అనంతనమస్కృతు లొన రించియుండెడివాడు. నదీరాబేగము తన శవమును భారతభూమి గర్భముననుంచు నదృష్టపు కోరికయే తన తుదికోరికయని జెప్పి తన యసువులు బాసెను. ముస్లిమువనిత యగు నదీరాబేగము నకే భారతభూమిపై యంతపూజ్యభావముండినప్పుడు ప్రతిహైందు వునికెంతటి యభిమానము తన మాతృభూమిపై నుండవలెనో జక్కగ యోచించుడు.

ఏ ప్రాణియభీష్టము ననుసరించి తాను భారతభూమియందే గడపవలసి యుండెనో యట్టి దేవిదైవసాన్నిధ్యము జేరినప్పు డిక మనకు గావలసినదేమున్నదని పాషండుడగు మాతిక్ జీవన్ సన్మాన మృత్యుగ హర్వమున జొరక పారశీక దేశమునకు దారా దారిదీసి యున్నచో కొంత నయముగ నుండియుండును. మాతిక్ జీవన్ వచ్చినవారిని రెండుదినములు మిగుల సత్క రించెను. దారా నిరాశా హృదయుడై ముందువెనుకలు యోచింపక తన్ననుసరించుచుండిన గుల్ మహమ్మదును, మక్బల్‌ను బిలచి తన సతీశవమును భద్రముగ దీసికొనిపోయి లాహోరన మియా

మీర్ మహానీయుని సమాధిచెంత గుప్తపరుప నాజ్ఞలిచ్చి భృత్యులతోడను కుమారునితోడను పారశీకమునకు ప్రయాణమయ్యెను. దారా దాదరువిడచి కొంతదూరము బోవునప్పటికి పాలు బోసి పెంచినపాము, పయోముఖ విషకుంభమగు మాలిక్ జీవను, పోవుచున్నదారాను దారియందడ్డగించెను. ప్రాణదాతయగు తన్ను బాధించి ఔరంగజేబు మన్ననలబొంద సాహసించిన మాలిక్ జీవనుని విపరీత చేష్టమునుజూచి దైవోపహతుండగు దారా విధి అడుగడుగునకు తన్ను వెక్కిరించుచుంద నిక దప్పించుకొన సాహసించుట వెఱ్ఱితనమని అకాల సర్పమును నెదుర్కొన తన చిటికనవ్రేలనైన పైకెత్తినవాడుకాడు సిపైర్ షూకో కొంతవఱకు బోరెను గాని బలాధిక్యముగల మాలిక్ జీవను ఆ చిరుతప్రాయుని కనికర మినుమంతైనలేక శీఘ్రముగ బంధించివైచెను. దారా సహితము బంధింపబడి మరల ఆ విశ్వాసఘాతకుని గృహమునకు తేబడెను. మాలిక్‌చే జయసింగు నకీవార్త వెంటనే దెలుపబడెను. సిపైర్ షూకో హస్తముల బంధింపబడిన దృశ్యమును జూచి తండ్రియగు దారా హృదయము దద్దరిల్లి ద్రవించిపోయెను. ధర్మపత్ని తన్నెడబాయుట, ప్రతి సంగ్రామమున ఓటమిగలుగుట, సంప్రాప్త గజపద తాడితామరణనివృత్తి తనచే బొందిన మాలిక్ జీవన్ తనప్రాణముల దీయుట కెసరుబెట్టుట, కుమారుని కోమల హస్తములు బంధింపబడుట, దారాను నొక వెఱ్ఱివానిగ జేసివేచెను. అతడిక సహించ

లేకపోయెను. "ఓరీ! ఘాతుక రాక్షసుడా, విశ్వాసహీనుడా, వలయునన్న మమ్ములనిప్పుడే సంహరింపుము. మేము దురదృష్ట దేవతకు, ఔరంగజేబుయొక్క అన్యాయమగు దురాశా పాశమునకు దాసులము. కాని, నిర్భాగ్యుడా నిన్నొకప్పుడు మరణము నుండి గాపాడితిననుట జ్ఞాపకమునకు దెచ్చుకొనుము. ఈ ప్రాణముల శాశ్వతములు. ప్రాణదానమొసగినవారిని తమ జేతులార బలి యొసంగజూచిన కర్కశ హృదయుల చరిత్ర యందెచ్చటను గాంచమైతిమి. రాజకుమారుల చేతుల నిదివరకెవడును వెనుకకు విరచికట్ట సాహసింపలేదనుట దెలసికొనుమని" అశ్రుపూరితాలోచనుండగు దారా మాలిక్ జీవనుతో నుడివెను పాపపు హృదయుడగు మాలిక్ కొంతవరకటునిటు తొట్రుపడి సిపాయిలను బంధవిముక్తిని గావించెను. జయసింగు, బహదూరుఖానునితో దాదరునకు వచ్చి దారాను అతని కుమారుని, ఇద్దరు కుమార్తెలను స్వాధీనముజేసకొని బక్కరుకోటను తమ స్వాధీనము జేయవలయునని వసంతునికి వ్రాసిపంపమని దారాను జయసింగు కోరెను. నిరాశా పరవశుడగు దారా ప్రభువు శత్రువులేమిజేయమన్నను, అడ్డులేకుండజేసెను. జయసింగు మాలిక్ జీవనునకు వేయి అశ్వదళముల కధిపతిగను, భక్తియార్ అను బిరుదము నిచ్చి తమతోగూడ ఢిల్లీకివచ్చిన యింకను గొప్ప బహుమతులొసంగబడునని జెప్పెను.

కంచియే చేను మేసినదన్నట్లు మాలిక్ జీవనే కొద్దిపాటి గౌరవముల కాశించి దారాను బంధితునిజేసినందుల కిప్పటికిని మేలునకు కీడుజేసినవారిని మాలిక్ జీవనులని బిలచుట పరిపాటి యైపోయినది. రెండుమాసములకు బహదూరుఖాను, మాలిక్ జీవనులిరువురునుదారాను కుటుంబ సమేతముగ దీసికొనివచ్చి ఔరంగజేబునకు విశ్వాసపాత్రుడగు నాజర్‌బేగ్ అను కొజ్జా అధీనము గావింపనతడు వారిని ఢిల్లీకి మూడుమైళ్లదూరమున నున్న కవాన్ పురమను గ్రామమున కైదుచేసి యుంచెను. రెండుదినములనంతరము ఔరంగజేబు బంధీలను గూర్చి దెలసికొనెను. తర్వాత నాల్గుదినములకు దారాయు, నతని కుమారుడును ధవళతా హీనమగు వస్త్రములు, ఒకనిగిన చితలపాగాయు, ఒక కాశ్మీరుశాలువయు ధరింపజేసి కాళ్ళకు సంకెలలు దగిలింపజేసి బక్కచిక్కిన మలినపూరితమగు నొక ఆడ యేనుగపై వారినెక్కించి నజీరు ఖడ్గధారియై వారివెనుక గూర్చొన ఢిల్లీ పురజనులు జూచుటకై వీధులవెంట నూరేగింపుగావించిరి. మాలిక్ జీవనుడు ఆ యేనుగ ప్రక్కనే నడచుచుండెను. పురజనులుదేశ్రిక పూరితులగుచో వారిని ఆపుటకై తగుసైన్యము బహదూరుఖాను కనుసన్నలతో నడచుచుండిరి. అదే పురవీధులందు కొన్నిమాసములకు పూర్వము కిరీటమొక్కటిలేని చక్రవర్తివలె సకల సన్మానసంభరితా సన్నివేశ సంప్రాప్తసముజ్వల సమన్వితాను లక్షణములతో సురనాధునిబోలె వూరేగిన దారా యిప్పుడు దరిద్రనారాయణునివలె

మిగుల దీనాతి దీనుడైనటునిటు జూడక వాడిపోయిన పుష్పము వలె మిడిమిడి యెండలో బోవుచుండ ఒక బిక్షకుడు దారాను జూచి "ఓ ప్రభూ! నీవు సంపదలతోనుండి నప్పుడు ప్రతిదినము బహుమానములిచ్చుచుంటివి. ఈ దినము నాకిచ్చుటకు నీవద్ద యేమియు లేకపోయెనుగదా" యని అరచెను. నివ్వెరపడి భ్రాన్తై, అచేతనుడై యుండిన దారా ఆ వాక్యములను విని కన్నీరు విడచి అతనిపైనున్న వస్త్రమును బిక్షకునికి విసరివేచెను. ఢిల్లీ లోని ప్రతివ్యక్తియు దారా దురవస్థను దిలకించి కన్నీరు మున్నీరై కంపిత హృదయులై యేడువజొచ్చిరి ఆ దినము ప్రతి ఇంటనేదోయొక యుపద్రవముగలిగినటుల రోదనధ్వను లతో పట్టణమంతయు నిండిపోయెను. కాని యేవ్యక్తిగాని తమ ప్రాణసమానుడగు దారాను గాపాడ ఖడ్గధారియగుటకు సాహ సింపలేదు. బహదూరుఖానుడు దారాను సిపైరు షూకోను యిట్లూ రంతయు ద్రిప్పి మరల నజీరుబేగున కొప్పగించి వెడలిపోయెను ఢిల్లీపురజనుల ఆక్రందన ధ్వనులు వారికి దారాపై గల యభి మానమేయని గ్రహించి ఔరంగజేబు ఆ దినము సాయంసమ యముననే ఒకసభ గావించి దారాను గ్వాలియర్ నందుంచుటా మరణింపజేయుటాయని ప్రశ్నించెను. చాలమంది అతనిని గ్వాలి యరు నందుంచుటే భావ్యమని నుడివిరి. దనీషమంద్ ఖాన్ చాల దినములుగ దారాకు విరోధుడైనను దారాను గ్వాలియరు నందుం చుటే సమంజసమని ఉద్ఘాటించెను. కడకు కాలభుజంగయగు

రోషినారా దారాను జంపుట న్యాయమని వక్కాణించెను. ద్రోహి యగు కలీలుడు షయిస్టఖానులు సహితము దారా ప్రాణముల నిలువబెట్టుట కెంతయో బ్రయత్నించిరిగాని వారి ప్రార్థనలంగీక రింప బడలేదు. దారాను ద్వేషించుచుండిన ఉలేమాలందరు దారా ను జంపుటకును సిపైరు షూకోను గ్వాలియరునందు బంధించు టకును తీర్మానించి ఈ దిగువ కనిన విధానమున నొక ఫర్మానా వ్రాసిరి. "మతోద్ధారకులు దారా జీవితమువలన మతవినాశము నకు కారణమగుచున్నదనుట కనుగొనిరి. మతరక్షణకొరకును, పవిత్రశాసనమునకు మచ్చ యేర్పడకుండుటకును దారాను బ్రతికి యుండనిచ్చుట ధర్మవిరుద్ధమగుననియు రాజ్యమున శాంతి నెల కొల్పుట ముఖ్యమనియు భావించి చక్రవర్తిగారు విధిలేక దారాకు మరణము విధించ సాహసించిరి" మరుసటి ఉదయమున ఔరంగ జేబు మాలిక్ జీవనుని సన్మానించుటకు దర్బారునకు రావలయు నని గోరెను. ఆ నరరాక్షసుడు మిగుల నుత్సాహముతో ఢిల్లీ పురవీధులలో తగు భటబృందముతో బయలుదేరెను. ఆ పురవాసు లాబాలగోపాలము దారాను బట్టియిచ్చిన ఆనరాధముని జూచినం తనే యుద్రేక పూరితులై మలమూత్రాదుల వారిపై జల్లుచు, రాలబువ్వుచు, మాలిక్ జీవుని గోష్ఠిని జీకాకుపరిచిరి. మాలిక్‌ను ఢిల్లీ కొత్వాల్ సంరక్షింపకపోయి యుండనిచో అతడు ఢిల్లీ యధర్మ సార్వభౌముని జూచుటకుబదులు నరలోక సార్వభౌముని తప్పక దర్శించి యుండెడివాడు. మొగలు సైనికులలో

హైబత్‌ఖాను నతడే జనులనుద్రేక పరచెనని నేరముక్రింద అత నిని రంపముతో రెండు భాగములు చీల్చివేయ ఔరంగజేబుత్తర వుల గావించెను. సార్వభౌమ పదవికి ఇట్టి కిరాతహృదయునిని ఆలోకైకనాధుడేల యేర్పాటు జేసెనో యాలీలా రహస్యము స్థూలదృష్టికి మాత్రము గోచరమగుటలేదు.

చేసినపాపము కట్టికుడువకపోదని కుడిచేత చేసినది యెడమచేత తప్పక ననుభవింపక తీరదను పెద్దల వాక్యము రిత్త బోలేదు. మాలిక్ జీవను క్షణ బంగురములగు కల్పిత వ్యామోహామునకాశించి తనకు ప్రాణభిక్షనిడిన దాతను రక్షించుటకు బదులు భక్షించిన పాపమునుజూచి సర్వేశ్వరుడు సహితము సహింపలేకపోయెను. అతడు దారాను బట్టియిచ్చిననాడు తన స్వనగరమగు దాదరును జూచిన చూపే కడపటి చూపయ్యెను. మాలిక్ జీవను ఢిల్లీని విడచి తన మాతృదేశమునకు బోవుచుండ అతనిపాపము పండి ఫలించినదోయన దారియందు కొందరు దాగియుండి అతనిపైబడి ఖండఖండములుగ జీల్చివైచిరి. పాపియగు మాలిక్ జీవన్ జేరవలసినచోటున జేరిపోయెను. అట్టిపాపపంకిలమున కాలవాలమైన యా నిర్భాగ్యుని చరిత్ర విడచిపెట్టి యిక దారాగతి యేమైనదో బరికింతుము. మాలిక్ జీవన్‌పై జనులు జూపిన ఆగ్రహాములోని సూక్ష్మమును గ్రహించి యింకను నాలసించిన యెట్టియిడుములు సంప్రాప్త

మ్మగున్నోయని ఔరంగజేబు దారాను అనిశీథముననేమడియింప సమకట్టి నజీరు కులీని బిలిపించి తండ్రినుండి తనయుని వేరు పరచి తన అన్న మస్త్రకమును దెచ్చి జూపమనిచెప్పి ష్యాప్ ఖానును పనులు పొరబాటు లేకుండ జరుగ గలందులకై నియ మించెను. ఆకాళరాత్రియందు దారాయు, నతని కుమారుడును కొన్ని దుంపల నుడకబెట్టుకొనుచుండిరి. తమకు విషాన్నమి డెదరని భయముచే భావి సామ్రాజ్య చక్రవర్తి. స్వయముగ మంటలుపెట్టి కందముల వంటలు చేయబూనెను. కాలమున కొక పద్ధతి నియమములేకపోయెను గదా. నిన్న చండశాసనుడు, నేడు శాకపాకకుడు, నిన్న మృదుమధుర పదార్థ ప్రియాస్వరూపి, నేడు కఠిన కంద మూలముల పచనా పిపాసి, నవరత్నమణి మయభూషితుడై చక్రవర్తికి రెండవ ప్రాణమై వేలకొలది భటులు తన కనుసన్నల మెలగమయూర సింహాసనాసీన అలం కరణమునకు సిద్ధముగనున్న దారా వేడుగడ్డల నుడకబెట్టుచుండ జూచిన యేమానవుని హృదయమైనను శతసహస్ర వ్రక్కలై పోదు! స్వర్గతుల్య సర్వసుఖములనుభవించిన అంతటిదారాకే యీ ప్రాప్తిగలిగినప్పుడు సాధారణుడగు నరునిమాట యేమి లెక్క. ఈ కాలభుజంగము ముందు ప్రతివ్యక్తియు నొక సూక్ష్మక్రిమియేగదా! నిన్నమొన్నటివరకు దారాకు గడగడలాడి పోవుచుండిన నజీరుఖాను ఆదిగాగల నర రాక్షసులు, దారాగది లోనికి జొచ్చిరి. దారా వచ్చిన నరహంతకులనుజూచి సంగతి

గ్రహించి ప్రమాన్పడి "మీరు మమ్ము వధించుటకు వచ్చితిరా" యని ప్రశ్నించెను. అందులకు వారు. ప్రస్తుతము మాకు యెవరినిగాని సంహరించుటనుగూర్చి తెలియదు మీ కుమారుని మీనుండి వేరుపరచి మరియొకచోట సురక్షితముగ నుంచవలయు నని యుత్తరవైనది. మేము మీ కుమారుని దీసికొని పోవు టకు వచ్చితిమని" బదులిడిరి. నజీరు ఖానుడు బాలునిజూచి "లెమ్ము ఆలస్యమేల" యని తన విషపుచూపుల బఱపి గర్జించెను సిప్హైరు యీమాట వినినదే తండ్రిని కౌగలించుకొనెను. తండ్రియు తనయుని తనహృదయమునకు హత్తుకొనెను. అయ్యో దైవమా! అయ్యో దైవమా!! అని యిర్వురేడసాగిరి. కఠిన శిలా కర్కశ కర్కోటక హృదయులగు ఆ బానిసలకు ఆ దృశ్యమును జూచి ఆవంతయైన చలనము కలుగలేదు పైపెచ్చు సిప్హైరును సమీపించి. ఆలస్యముజేసిన యీడ్చుకొని పోవుదుమని పిశాచము లవలె నాబాలునిపైబడి యీడ్చుటకుద్యమించిరి దారా యిక సహింపలేకబోయెను. కన్నీరు దుడుచుకొని "నాయనలారా. నాకుమారుని నావద్దనే యుంచుటకు నా సోదరుని ప్రార్థించినటుల దెల్పుడని" దీనముగ జెప్పెను అందులకు నజీరుడు. మేము మీ వార్తావాహులము కాము మేముత్తరవుల పరిపాలించుటకే వచ్చితిమని" వారు దారా కౌగలినుండి సిప్హైరును దూరమునకు లాగిరి. దారా తనకిక తుదిసమయమాసన్నమైనదని దెలసికొనెను. తన సమీపముననుండిన దిండును జించి అది వరకే తాను దాచి

యుంచిన ఒక చిన్నకత్తి నిదీసి బాలుని యీడ్చుచుండిన బానిసను బొడిచెను. ఆకత్తి ఆ పాపాత్ముని యెముకలో బోయి గ్రుచ్చు కొని మరల యెంతలాగినను రాకపోయెను. కావున ఆయుధ విహీనుడగు దారా ఆ నిరంకుశ బానిస భూతముల గుద్దుట కారంభించెను కాని యేనుగుల దినువారికి పీనుగలు పేలవిండి యన్నట్లు వారందరేకమై ప్రక్కగదినుండి కుమారుని రోధన ధ్వని వినుచుండిన దారా మస్తకమును నొక్కవ్రేటున దెగవేసిరి కొంతదూరమునుండి భయంకర కృత్యమును జూచుచుండిన మనూమ్ అను నతడు దారా శిరము నేలపై బడియు "అల్లా అల్లా" యని పవిత్ర నామముచ్చరించుట యీమహాపాపి సహి తము వినెనని తన దినచర్య పుస్తకమునందు వ్రాసియుంచెను.

ఏ చక్రవర్తి తనకు రావలసిన మకుటాధిపత్యమునకై యిన్ని దినములు విధివిలాసమున కెదురీదెనో యతడు తుదకు 1659 వ సంవత్సరం ఆగష్టు 30 తేది దివంగతుడయ్యెను. సదయ హృదయుడగు దారాకు భూలోక సింహాసనముకన్న స్వర్గలోక సింహాసనమే సుఖదాయియని ఆ సర్వాంతర్యామి యతనిని తన పాదసాన్నిధ్యమునకు బిలిపించుకొనెను, కాబోలు. భూపతనమైన దారా మస్తకము సోదరుని శపించుటకు బదులు దైవప్రార్థనే జేసెననుట, విన్నప్పుడు క్రీస్తు శిలువపై కొరతవేయ బడినప్పుడు "తండ్రి వీరిని రక్షింపుము వారెట్టికార్యము చేయు

చున్నది వారికే దెలియదు. (Father, forgive them for they know not what they do) అన్న నుడువులు జ్ఞాపకమునకు దెచ్చుచున్నవి. యేసుక్రీస్తు, దారా మొదలగు ఉత్కృష్ఠజీవులు మానవులు భయసంభ్రమమునతను జీవితముల గడుపుట కొరకే భూలోకమునకు యవతరించిరన్న అతిశయోక్తి గాదు.

ఖండింపబడిన దారా శిరస్సును కాలకూట విషహృదయుడగు జారంగజేబు సముఖమునకు దేబడెను. కాని యా కర్కోటక చక్రవర్తి ఆ శిరస్సు ధూళి దూసరాయుక్తమై యుండుటచే అయ్యది తన భాతృప్రధానాంగము గాదేమోయని సంశయించి దానిని శుభ్రముగ గడిగి ఒక పళ్లెరమునందుంచి తెమ్మని గోరెను. బానిసలాశిరమును శుభ్రముగగడిగి తీసికొని రాగ ఔరంగజేబించుకైనను వ్యధజెందక నేనీమతద్వేషిని బ్రతికి యున్నప్పుడే జూచుటకిష్టపడని నేనిప్పుడైనను నెందులకు జూడవలయును ఆవలకు దీసికొని పొండని బలికెను. మరుదిన ప్రాతఃకాలమున దారా మొండెమును ఒక ఏనుగపైగట్టి ఢిల్లీ పుర వీధులంతయుదిప్ప ప్రజాహృదయములు దద్దరిల్లి యిట్టి ఘాతుక కృత్యమును జేయనేర్చిన భూపాలుని వలన లోకమున కెట్టి ముప్పువాటిల్లునోయని భయవిహ్వాలురైరి. అంతటితో ఔరంగజేబు దౌష్ట్యమడుగంటలేదు. అతని తోడిరాక్షసియగు

రోషనారా ప్రోత్సాహముచే దారా తలను ఒక పెట్టెయందుంచి దానిని బహుమానముగ ఆగ్రాలోనున్న తనజనకుడగు షాజహాను నకు బంపెను. షాజహాను ఆ బహుమతి నందుకొని దుష్టుడగు కుమారుడు తన్ను బొత్తిగా మరచిపోలేదని నుడివి మందసమును దెరచి తన కుమారుని తలను జూచి కెవ్వున కేకవైచి మూర్ఛ నొందెను. జహానారా బేగము రోదన యింతింతయని చెప్ప నలవిగాక పోయెను.

"అగ్ని జారుణ రక్తపంకాంకితమగు
పాణియుగమున నల్లాను ప్రస్తుతించె
నమ్మహాహత్య తనది గాదన్నయట్లు
నన్నతులనంది దైవంబు మిన్నకుండె"

దారా ప్రేమకు దైవత్వమునకు మూర్తీభవించిన ధర్మమూర్తి శూరుడైనను ప్రపంచ శాంతికి మానవ ఐక్యతకు పాటుబడిన మహనీయుడు గుడ్డి విశ్వాసపు భృత్యుడుగాక మానవ ప్రజ్ఞా ఐక్యతకంతయు యీ వ్యక్తియందే మూర్తీభవించినదని పేరొందిన దివ్యజ్ఞమూర్తి ఇట్టి మహత్తర విజ్ఞాన సౌందర్య మూర్తి జీవితము మరణములబట్టి మానవునిపై భగవంతుని చర్యలగమ్యగోచరములని నిదర్శనమయ్యెను. దారాను యే పుష్పమును జేసి దైవము వాడుకొనెనో యెవరికెరుక!

దారాగుణసంపద మానవలోకమునకు ఆదర్శప్రాయము. ఉచితజ్ఞానమునకు నతనిం జెప్పి యన్యుల జెప్పవలయును. యువరాజై యుండియు నతడు గర్వికాక, యెల్లరతోడను మృదుమధురముగ భాషించుచుండెను. ఏకార్యమునేని జేయునప్పుడు స్వయముగ నాలోచించి చేయుచుండెను. మిత్రుల సలహాలను దీసికొనుచుండెను. ఎల్లప్పుడు నానందముగనుండుటయే యతని లక్ష్యము. ఔరంగజేబువలె కుటిలమైన చిరునవ్వు నత డెరుగడు. సహజసరళత్వముతో నతడు ప్రజల నాకర్షించుచుండెను.

విద్యావ్యాసంగమన్నను, మతవిషయముల దెలిసికొనుటన్నను మిక్కుటమగు నభిలాష యతనియందు గోచరించుచుండెను. కుటిలరాజనీతి నతడు యేవగించుకొనుచుండెను. హిందువులన్నను, మహమ్మదీయులన్నను, యొక్కటిగనే బరికించుచుండెను. అతని లక్ష్యమంతయు హిందూమహమ్మదీయ సమ్మేళనముమీదనే యుండెను. మతోద్రేకములన్న నతనికి గిట్టకుండెను. నిజమున కతడు శాంతిదూత యనదగిన మహాపురుషుడు.

అబోటిన్ ఆదమునకు గనబడిన శాంతిదూత దారా కగపడి యుండిన "సర్వమానవప్రేమ జూపు సజ్జనబృందమున నాపేరును గూడ జేర్పుమ" ని యతడు ప్రార్థించియుండెడివాడు. నిజమునకు దారా ముస్లిముపరివారమునం గాక యన్యపరివారమున జనించి యుండిన నెంతయో ఖ్యాతిపొంది యుండెడివాడు.

దారా ధర్మపరాయణుడు. తలవెంట్రుకవాసియైన నతడు ధర్మము దప్పి యెరుగడు. సార్వభౌముని గుమాస్తైనను, సంపదలందు దేలియాడక యతడు దారిద్ర్యమునే యనుభవించెను. అతడు హెరాన్ ఆల్ రషీదు, పీటర్ ది గ్రేట్, శివాజీ వంటి మహనీయుడు గావలసినది. కాని ఆతని జీవితారంభమే దానికి నవరోధము గల్పించినది.

తన ముత్తాతయగు నక్బరుచక్రవర్తి గుణము లతనియం దెన్నియో గోచరించుచుండెను. మానవశాంతిగూర్చుటే తన కర్తవ్యమని దారా యెల్లప్పుడును భావించుచుండెను. ఫకీరుగాని, సన్యాసిగాని, దెలుపు యభూతకల్పనలునైత మతడు నమ్మునట్టి సరళవిశ్వాసము గలిగియుండెను. దేవాలయముల బాడొనర్చుటయు, అన్యమతస్థుల హింసించుటయు దనకు సరిపడకుండెను.

"దేవాలయమును బాడుచేయువాడు తన ప్రార్థనామందిరమును ముందు బాడొనర్చుకొనవలయున" ని యత డొకప్పు డనెను. మతసహనమే దేశక్షేమము జేకూర్చునని యతని నమ్మకము. దారా దివ్యసూక్తులు నేడు గాకున్నను రేపయినను ప్రపంచ మారాధించును.

# పదునొకండవ ప్రకరణము

# సుతేమానుషాకో - సమాప్తము



దారా మరణానంతరము ఔరంగజేబు అన్నదమ్ముల వధించి యేపాపము తానెరుగనట్లు, తానే జ్యేష్ఠనందనుడయినట్లు అలంగీరు పాదుషా బిరుదాంకితుడై తాను చక్రవర్తినని ప్రకటించుకొని, మయూరసింహాసనము నధిష్ఠించెను. అంతటితో నతని దురాగతము అంతముగాలేదు. దారాకు సర్మద్ అను నొక మహాత్ముడు గురువైయుండెను. అతడు విజ్ఞాని, తపస్వి, సన్యాసి, త్యాగి, అతడు మొదట యూదవుడయ్యె, తదుపరి ఇస్లామ్ మతమును స్వీకరించెను. యూరపునుండి వ్యాపారియై మన దేశమునకువచ్చి, అబయచందను బాలుని గురుగా భావించి సన్యాసియయ్యెను. అతని మత విజ్ఞానసంపదల దిలకించి దారా శిష్యుడయ్యెను. సర్మద్ ప్రాపంచిక సుఖముల నావలకుద్రోసి ఢిల్లీయందు నివసించుచు ప్రజల గౌరవమును మిక్కుటముగ జూరగొనెను సర్మద్‌నకు దారాయనిన మిగుల ప్రేమ. ఢిల్లీప్రజలకు సర్మదు మాననీయుడు. సర్మద్ ఢిల్లీయందుండినచో ప్రజలు తన కెదురుదిరుగుదురని అలంగీరు భయపడెను. కొందరు మౌల్వీలు సర్మద్ ముస్లిం మతమునకు విరుద్ధముగ ప్రచారము జేయుచున్నాడను నిందను మోపిరి. ఔరంగజేబు సర్మద్‌ను పిలిపించి నున్నీతెగ ననుస

రించుటో లేక మరణదండన పొందుటో కోరుకొనుమని యాదే శించెను. సర్మద్ అందులకు చిరునగవు నగుచు అశాశ్వతమగు ప్రాణముపై దీపించే ఆత్మవిరుద్ధముగ ప్రవర్తింపజాలనని దెల్పెను. అందుపై ఆ మహనీయుని వధ్యస్థానమునకు గొనిపోయిరి. అత డచ్చట నిర్భీతిగ తన శిరస్సును వంచి ఖడ్గము తన్ను ఖండింపక మును పీ విధముగ బల్కెను "అలజడిసివిని దీర్ఘనిద్రనుండి మేల్కొంటిమి. కన్ను దెరచి చూచునప్పటికి అకాశరాత్రి యింకను పాపసన్నిహితమై యుండుట కనుగొంటిమి. కావున చేయునది లేక మరల శాశ్వతనిదురనే స్వీకరించితిమి" అని నుడివి చిరు నగవు నగచు, ఖండించమని చెప్పెను. అతనితల భూపతన మైనప్పుడు దారా శిరస్సువలె అల్లా! అల్లా!! అల్లా!!! యని జేసిన స్మరణను సమీపమున నుండిన యిబ్రహిం అనునతడు చక్కగ వినినట్లు దెలియుచున్నది.

సర్మద్ మరణానంతరము అలంగీరు దారా పెద్దకుమారు డగు సులేమాను షూకోను బంధింప బ్రయత్నించెను. సులేమాను యొక్క విస్తార సైన్యము అలహాబాదునందు అతని విడచి వెడలిపోయెను. కేవలము 6000 సైన్యము మాత్రమే అతని ననుసరించి యుండెను. సులేమాను కాశ్మీరదేశమునకు పయన మయ్యెను. కాశ్మీరదేశము జేరునప్పటికి రాకుమారునివద్ద 2000 సైన్యమే యుండెను. తండ్రిని బంధించిన జయసింగు తనయుని

సైతము పట్టుకొనుటకు సైన్యముల బంపుచేగాక కృత్రిమలేఖలచే కాశ్మీరరాజు మనస్సును జెఱుప బ్రయత్నించెను. నమ్మకస్థుడైన సేనాధిపతి బాకీబేగు దారియందు మరణించుటచే సులేమానుకు సలహా లిచ్చువారు లేకపోయిరి. రాకుమారుడు సైన్య విహీనుడై వచ్చిన తప్పక రక్షింతునని శ్రీనగరాధిపుడగు పృథివీసింగు జెప్పి పంపెను. కాని జయసింగు బంపిన కృత్రిమ లేఖను జూచి అతడు మోసపోయెను అంతు తన పినతండ్రియగు షూజా అలహాబాదు కోటను బట్టుకొనెననియును తన నచ్చటికి రమ్మనియును వ్రాసియుండెను. అందలి మర్మ మెఱుగలేక సులే మాను కాశ్మీరును విడచి, అలహాబాదునకు బయనమయ్యెను. అట్టి సమయమున తనవద్దనుండిన కొద్దిపాటి సైన్యము సహితము అతనిని విడిచిపోయెను. శత్రుసైన్యములు సమీపముననే తన్ను బంధింప గాచియున్నవని విని, అదృష్టహీనుడగు సులేమాను తన భార్యతోడను పదునేడుమంది సైనికులతోడను శ్రీనగరము నకు పోయి పృథివీసింగు శరణుజొచ్చెను దారా యొకప్పుడు తనకుజేసిన సహాయమును మరువక కాశ్మీర ధరాధిపతి సులే మానును మిగుల గౌరవించి తన కుమార్తె నిచ్చి వివాహము గావించి అతనిని వేయికన్నులతో గాపాడజొచ్చెను. ప్రపంచమున నెన్నివిధములగు మానవులుందురో జూచితిరా! విశ్వాసఘాతకు లగు జయసింగు, మాలిక్‌జీవర్, కలీల్, మొదలగు కృతఘ్నులు నివసించిన భారతదేశమున పృథివీసింగువంటి కృతజ్ఞులు సహితము

లేకున్నచో మనదేశము పవిత్రభూమిగ పరిగణింపబడియుండునా! సులేమానున కాశ్రయమిచ్చుట కొరపితో తలగోకికొనుటయే. పాషాణహృదయుడగు చక్రవర్తియొక్క అపారసేనావాహినిని ఢీకొనుటయనిన సామాన్యమా! తనరాజ్యసంపదపోయినను సులేమానును రక్షించుటకే పృధివీసింగు బూనుకొనెను దేశచరిత్రలయందు శరణాగతరక్షకులని పేరుగాంచిన రాణా రాజసింగుసహిత మొనర్పని సాహసకార్యమునకు గడంగి కాశ్మీరాధిపతి శాశ్వతమైన గీర్తిని సంపాదించెను. జయసింగు పృధివీసింగుపై ప్రయోగించిన సామ, దాన, భేద, దండోపాయములు నిష్ఫలములై పోయెను. అందువలన చతురతయం దద్వితీయుడగు జయసింగు కాశ్మీర ప్రధానమంత్రిని లోబరుచుకొని, సులేమానును దరిమివేయుటకు పన్నాగము బన్నెను. కాని యత డెన్నివిధములజెప్పినను సులేమానును చక్రవర్తి కప్పగించి, బహుమానములబొందుటకు నాత డిచ్చగింపలేదు. అందువలన ప్రధాని ఔషదమందు విషముగల్పి సులేమానున కిచ్చెను. కుశాగ్రబుద్ధిగల రాకుమారు డామందు ననుమానించి దానిని పాలలో గలిపి యొక మార్జాలమునకు బోయించెను. అది వెంటనే మృతిబొందెను. ఈవార్త పృధివీసింగునకు దెలియగనే యతడు కోపోద్దీప్తుడై ఆమంత్రిని యమసదనమునకు బంపెను. జయసింగు తనపాచిక పారకుండుట జూచి పృధివీసింగు కుమారుడగు మేదినీసింగునకు ఎన్నియో దురాశలు గల్పించెను. మేదినీసింగు ప్రలోభుడై తండ్రిని

చెరయందుంచి, సులేమానుషూకోను ఢిల్లీనగరమునకు తీసికొని వచ్చెను. సులేమాను సింహాసనార్హుడనియు ఈరాకుమారుని మన నిచ్చినచో దారా కంటే యితడే ప్రబలశత్రుడగుననియు భావించి ఔరంగజేబతనిని జంపించెను. సులేమాను ఔరంగజేబుముందు నకు చేబడినప్పుడు అతని తీపియు, శౌర్యమును జూచి అలంగీ రచ్చరువొందెను. సులేమాను పినతండ్రియగు ఔరంగజేబుతో దన్ను పాపీలుత్రముల కషాయమిచ్చి చంపక వెంటనే వధింపు మని గంభీరముగ నుడివెను. ఔరంగజేబు ప్రేమగలవానివలె నటించుచు అట్టివానీయు మొసగుట జరుగదనెను. తరువాత గ్వాలి యరుకోటకు రాకుమారుని బంపివేసెను. అచ్చట నతనికి భయం కరమగు ఆవిషపానీయమే అనుదిన మీయబడెను. ఒకసంవత్సర కాలమా కషాయము గ్రోలినను బలిష్ఠుడగు సులేమాను మరణింప నందున నతని మెడనులిమి జంపి, మురాదు గోరీప్రక్కనే పాతి బెట్టుడని అలంగీరు ఆజ్ఞలిచ్చెను.

ఘోరరాక్షసుడగు ఔరంగజేబెందరినో యాత్మీయుల బలి నొసంగి, రక్తసిక్తమైన సింహాసన మధిష్ఠించెను. అంతేగాదు, రాజ్యకాంక్షావిమోహితుడైన మురాదును సింహాసనాసీనుంజేయుదు నని కల్లబొల్లి మాటలుజెప్పి, అతని సహాయమునుబొంది విజ యుడై, తదనంతరము మద్యమున విషము గలిపి యతని మది

యించెను. షాషూజాను అరక్కాను దేశమునకు తరిమి అందు కుటుంబముతో గూడ నతని నాశమొనర్చెను.

దారా కౌగిలినుండి వేరుచేయబడిన సిపైరుషుకోను గ్వాలియర్ కోటలో పండ్రెండు సత్సరములు ఖైదులోనుంచి, తరువాత ఢిల్లీనగరమునకు దెప్పించి తనసకుమార్తెయగు జుబదత్తున్నీసా నిచ్చి వివాహమొనర్చెను. వారికి "తాబర"ను కుమారుడు గలిగి ఆరుమాసములలో మరణించెను. దారాకుమార్తెయగు నదేరాబానును షాజహాను జాహనారాలు ప్రార్థించుటచే ఆగ్రాకు బంపించెను. ఆమె యచట వారి పోషణలో బెరిగెను. దారా జ్యేష్ఠకుమార్తె జానీబేగము మిగుల సౌందర్యవతియైనందున ఔరంగజేబు తన రెండవకుమారుడగు మహమ్మదుఅజీమున కిచ్చి పెండ్లి గావించెను. సులేమానుకుమార్తెయగు సలీమాబానును షాజహాను కడగొట్టుకూతురగు గౌహరారాబీగము బెంచెను. ఆమె ఔరంగజేబు కుమారుడగు మహమ్మదుఅక్బరునకు భార్యయయ్యెను.

ఇన్ని ఘాతుకకృత్యము లొనరించి సింహాసన మలంకరించిన ఔరంగజేబు యెట్టిసౌఖ్యము ననుభవించక ఆత్మశాంతి లేక తుది దినములలో యుద్ధభూమియందే మరణించెను. అతడు చనిపోవుటకు కొంచెము ముందు తన తనయుడగు మహమ్మదుఅక్బరునకు వ్రాసిన జాబును జదివిన అతని పాపహృదయ

మెంతగా దల్లడిల్లెనో దెలియును. "కుమారా! నేనీలోకమునకు వచ్చినప్పుడు పాపరహితుడనై వచ్చితిని. మహమ్మదు నన్ను చేయ నియమించిన కార్యమును జేయక పాపకృత్యములొనరించి, మోయలేనంత పాపభారముతో వెళ్లుచున్నాను. దేవుడు నేను జేసిన పాపకార్యములకు నన్ను క్షమింపడు! క్షమింపడు!! క్షమింపడు!!" అతడు పశ్చాత్తాప తప్తహృదయుడైనను గాకున్నను అత డీప్రపంచమే శాశ్వతమనుకొని చేసిన ఘోరకార్యములకు ఫలితముగ నెట్టిదః డన సర్వేశ్వరునివద్ద బొందెనో మానవులమగు మన కేమితెలియును!

స ం పూ ర్ణ ము.

# ధర్మసూక్తులు

హిందువు తాను గొప్పయనియు ముసల్మాను తాను శ్రేష్ఠుడనియు చెప్పుకొనుచున్నారు.

వారు ఒకే తల్లి పొట్టలోనే రెండుభాగము లయినప్పుడు వీరిలో యెవ రుత్కృష్టులని మన మనగలము? ఎవరు శ్రేష్ఠులు యెవరు కారు అను విషయమును గూర్చి తగవులాడదగదు.

ఒకరు రామభక్తులు. మరియొకరు రహీము యనురక్తులు. ఈ యిరువురును యనంతమూర్తిలో గలియువారే.

హిందువులు ముసల్మాను లందరు నొకటే.

ఆ సర్వాంతర్యామి నేపేరున బిలిచినను మనకు బ్రత్యుత్తర మొసగుట కతడు సర్వసిద్ధుడుగ నున్నాడు.